కళా ప్రచారక సమితి - ప్రచురము ౫.

అశోకుని ద్వితీయమహాదేవి యగు

# కారువాకి

చరిత్ర

( ఐదంకముల చరిత్రాత్మకమగు స్వతంత్ర నాటకము )

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

రాజమండ్రి

కృతికర్త:

మ॥శ్రీ॥ జయంతి వేంకట జగన్నాథరావు పంతులుగారు,

బి. ఏ., ఎల్. టి.,

నెపోలియను, కళింగసోపానములు, శ్రీకృష్ణుఁడు మొదలగు

గ్రంథములకర్త.

[ వ్యాఖ్యాసంకలితము ] [ వెల రూ. 1-0-0.

ఈ నాటకము

ఆడుటకును

అనువదించుటకును

గ్రంథకర్తగారి అనుజ్ఞ అవసరము.

గ్రంథకర్త.

# పరిచయము

పాఠకమహాశయులారా,

ఈనాటకము హైందవ సంప్రదాయముల మీరకుండ పాశ్చాత్య పద్ధతులననుసరించి వ్రాయబడినది. యువకుల పురోభివృద్ధికి ఆదిరసమల్పముగానుండి నీతిబోధకమగు చరిత్రాత్మకనాటకము లవసరము. ఆంధ్రుల తేజఃపుంజమును ప్రప్రథమమునఁ బ్రపంచమునకు వెల్లడించిన కళింగాంధ్రుల చరిత్రనుండి యీకథ గైకొనఁబడినది.

అశోకచక్రవర్తి తనపశుబలపరీక్షచే కళింగులనోడించి వారి యువరాజ్ఞియగు 'కారవాకి' దేవిని గొంపోయెను. కాని కళింగాంధ్రులు తమబుద్ధివిభవముచే నశోకచక్రవర్తిని, నాతని యఖండసామ్రాజ్యమును, స్వాధీనమొనర్చుకొని, యాతనిచేఁ దమయభిమానమతమగు బుద్ధదేవునిబోధనల నెల్లయెడల వ్యాప్తమొందించిరి. చండాశోకుఁడు ధర్మాశోకుఁడుగ మారుట యిందు ముఖ్యముగఁ జూపబడినది.

ఈనాటకము వ్రాతప్రతి నామూలాగ్రముగఁ జదివి, లోటుపాటుల సవరించి, యిద్దానిప్రకటించుటకుఁ దగినట్లొనర్చుటయేకాక, మా కారవాకికి మనవిమాటనుకూడ ప్రసాదించిన నామిత్రులు బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారికి వందనసహస్రములర్పించుచున్నాను. అభిమానముతో నచ్చుతప్పులు లేకుండఁజూచి, మా కారవాకిని వెలయించిన మహారాజశ్రీ దేవరాజు వేంకటకృష్ణారావు పంతులుగారికి నేనెంతయుఁ గృతజ్ఞుడను.

సహృదయులగు పండితులు ఈనాటకమును ఆమూలాగ్రముగఁజదివి తమయభిప్రాయమును ప్రసాదించి నన్నానందింపజేయ ప్రార్థితులు

ఇట్లు ఆంధ్రభాషాసేవకుఁడు,
జయంతి వేంకట జగన్నాథరావు.
*Senior History Assistant.*

Board High School,
ASKA (Ganjam)
*14th Jan. 1935.*

# మనవి

శ్రీయుతులు జయంతి వేంకట జగన్నాథరావుగారు రచించిన యీ నాటకము వాఙ్మయరంగమునఁ బ్రత్యేకవ్యక్తి యైయున్నది. నూతనోత్సాహ మాంధ్రుల నావరించియున్న యీ రోజులలో, నవలలు, నాటకములు, అఖండకావ్యములు, ఖండకావ్యములు, మొదలగు నూతనరచనలొకప్రక్క లెక్కకు మిక్కిలిగాఁ బిక్కటిల్లుచుండ, చరిత్రపరిశోధనలు, శాస్త్రపరిశోధనలు, భాషాపరిశోధనలు, వాఙ్మయపరిశోధనలు వేఱొక్కప్రక్క క్రొల్లక్రొల్లలయి యల్లిబిల్లిగా నల్లుకొని, వెల్లివిరియుచున్నవి. నామిత్రులు జయంతి వేంకట జగన్నాథరావుగారు చరిత్రపరిశోధనలుచేసినవారిలో ప్రసిద్ధులైయున్నారు. వీరు ప్రకటించిన "కళింగసోపానములు" కళింగదేశ చరిత్రమున వీరు కనిపెట్టిన నూతనవిషయములతో విరాజిల్లుచున్నది. వీరు రచించిన నెపోలియన్, శ్రీకృష్ణుఁడు, మొదలగు వచనకావ్యములు చారిత్రక విషయములు కథారూపముగా రచించుటలో వీరికిఁ గల సామర్థ్యమును వెల్లడించుచున్నవి. కాని, వీరు రచియించి నేఁడు ప్రకటించుచున్న యీ నాటకమును జదివినచో, ఆంధ్రలోకమాశ్చర్యము నానందమును బొందకపోదు

కళింగ దేశచరిత్రమున బహుకాలమునుండి వీరుచేయుచుండిన పరిశోధనలు కేవల రసోత్పత్తికై యుద్దేశించిన యొక నాటకమున నిముడ్చఁగలుగుట వీరి రచనా నైపుణ్యము వెల్లడి చేయుచున్నది. పరిశోధనలుచేసినవారు కలరు; నాటకరచనలు చేసినవారు కలరు. పరిశోధనములను [illegible] నాటకరచనలో నిముడ్చి, రసోదయము కలిగించిన జగన్నాథరావుగారిని జూచి, గరికిపచ్చడిచేసి, రాజుగారినిమెప్పించి, యగ్రహారము సంపాదించిన యీ మానవతి జ్ఞాపకమునకు వచ్చుచున్నది. ఒక్కటే

భేదము. విషయేతర రాహిత్యముగాదు జగన్నాథరావుగారి నీ రచనకుఁ బురికొల్పినది. నిర్మాణచాతుర్యమే. ఇనుమును బంగారముగా మార్చుటకు పరుసవేదికి దారిద్ర్యముకాదుగదా కారణము. స్వీయసామర్థ్యప్రకటనమే కాదా!

ఈ నాటకమున మూఁడు ప్రధానవిషయము లున్నవి:-

(1) ప్రపంచచరిత్రమున కళింగసామ్రాజ్యమునకుఁగల యుత్కృష్టస్థానము;

(1) మతచరిత్రమున బౌద్ధమతమునకుఁగల యుత్కృష్టస్థానము;

(3) అశోకుని కళింగవిజయమునకు కారణమైన కారవాకియే యావద్భారతవర్షమున బౌద్ధధర్మస్థాపనకు కారణమగుటచే, ధర్మస్థాపనకు సహాయమొనర్చిన యుత్తమస్త్రీలలో కారవాకికిఁగలయుత్కృష్టస్థానము.

ఈమూఁడు విషయములుగూడ, జగన్నాథరావుగారు ప్రత్యేకముగా పరిశోధించినవే.

(1) కళింగ రాజ్యమునుగూర్చి నేఁడు పెక్కురు పెక్కువిధములైన పరిశోధనలు చేయుచున్నారు. కాని, వీరిపరిశోధనలన్నియు క్రైస్తవప్రథమశతాబ్దము తరువాతివేగాని, తత్పూర్వమునాఁటివి కావు. కళింగరాజ్యము మహాభారతకాలమున ప్రసిద్ధమైయుండుటయేగాక, ఋగ్వేదకాలముననే కాళింగులు ప్రసిద్ధులైయున్నారు. కేవల వణిక్కులునిర్మించిన యీ కళింగ సామ్రాజ్యము అతిప్రాచీనకాలముననే సముద్రతీరముమీఁదుగాను, నదీముఖముల మీఁదుగాను, ప్రపంచము నాక్రమించినవి. ఈ సామ్రాజ్యము నిర్మించిన వణిక్కులే ఋగ్వేదకాలమున "పణు" లను పేరిటఁ బ్రసిద్ధులైయుండిరి. ఋగ్వేదములోని సరమాపణిసంవాదము పణుల ప్రభావమునే తెలియఁజేయుచున్నది. అదిగాక, ఇంద్రునిగూర్చిన యీ క్రిందిమంత్రమును జూడుడు.

దాసపత్నీరహి గోపా అతిష్ఠన్
నిరుద్ధా ఆపః పణినేవగావః
అపాంబిల మపిహితం యదాసీత్
వృత్రం జఘన్వా అపతద్వవార॥

"పణినామకో అసురః"అనిసాయనాచార్యులవారు వ్రాసినారుగాని, యాస్కులుమాత్ర మీక్రిందివిధముగావ్రాసినారు.

"పణిర్వణిగ్భవతి పణిః పణనాద్వనిక్ పణ్యం నేనేక్తి" యాస్కాచార్యులవారి నిరుక్తమున వ్రాసిన యీవాక్యము వలన పణులేవణిక్కులని స్పష్టమగుచున్నది.

ఈవణిక్కులు గంగాముఖద్వార మాధారముచేసికొని, క్రమముగా భారతవర్షతీరము నంతటిని స్వాధీనముచేసికొని, యాఫ్రికా ఖండతీరమును కాంగో (గంగా) నదినిదాటి, శ్వేత ద్వీపమును జేరియును, నీల సరస్వతీనదినిదాటి (Nile) మధ్యధరాసముద్రతీరముల నాక్రమించి, శ్వేతద్వీపము పర్యంతమును, క్రమక్రమముగ పసిఫిక్ అట్లాంటిక్కు మహాసముద్రతీరములును, ద్వీపములును, ఆక్రమించి, అత్యద్భుతమైన యొకసాగర సామ్రాజ్యమును నిర్మాణమొనర్చిరి. నేటి యాంగ్లేయుల సాగరసామ్రాజ్యముకన్న నూరు మడుంగులు మిన్నయై, వారికట్టుదిట్టముల కన్న నెక్కుడు కట్టుదిట్టములుగలిగి, వేలకొలదిసంవత్సరములు ప్రపంచమందంతటను అప్రతిహతముగా విజృంభించిన యీ సాగర సామ్రాజ్యమునుగూర్చి పరిశోధనలుచేసి, ప్రకాశింపజేయవలసినభారము భారతీయులపైగలదు. ఈ వణిగ్జాతులలో పెక్కు అంతర్జాతు లుండినవి. అవి: కరణులు, సాధులు, గుప్తులు, కిరాటులు, వైదేహులు, మొదలగునవి. మధ్యధరాసముద్రమున (Mediterranian) కరణులు (Cannanites) గుప్తులు (Egyptians) సాధ్వులు (Hellenes) కిరాటులు (Cretans)

అను పేర్లతో వణిగ్జాతులు (Phoenicians, sea - faring people) ఏర్పాటుచేసిన చిన్నచిన్న సామ్రాజ్యములనుగూర్చి పాశ్చాత్యులు పరిశోధనలుచేసి వింతసిద్ధాంతములను వ్రాసి యున్నారు.

ఈవణిగ్జాతులన్నియును పరస్పరైకమత్యముతోనున్నంత కాలము సామ్రాజ్యము నిర్విఘ్నముగా కొనసాగుచుండినది. కాని, వారిలో పరస్పరకలహములు ప్రబలుటతోనే, స్థలభాగములలో క్రొత్తగానేర్పడుచుండిన నూతనసామ్రాజ్యములు, (Land powers) జలభాగమందుండిన (Sea powers) యీ ప్రాచీన సామ్రాజ్యమున కంతరాయములు కలిగింపసాగినవి. అట్టిస్థలసామ్రాజ్యములలో జరాసంధుని మగధసామ్రాజ్యమును, వసుదేవ శ్రీకృష్ణుల యాదవసామ్రాజ్యమును, మొదటివి. శ్రీకృష్ణ జరాసంధులజలసామ్రాజ్యాక్రమణప్రయత్నములే మహాభారతయుద్ధమునకు ప్రధానకారణములు. తరువాత సార్థులును, కరణులును ఏకమై, సార్థకరణులను పేర తిరిగి హిందూమహాసముద్రతీరమును, మధ్యధరాసముద్రతీరమును ఆక్రమించిరి. వీరే సాతవాహను లను పేర భారతవర్షమునను (carthagenians) అను పేర మధ్యధరాసముద్రమునను ప్రసిద్ధినొందిరి. పారశీకసామ్రాజ్యము పశ్చిమమునను, మగధసామ్రాజ్యము తూర్పునను, వృద్ధియగుటతోనే, ఈసార్థకరణులయైకమత్యమునకు భంగముకలిగినది. పారశీకులును, గిరికులును, రోమకులును, పాశ్చాత్యసార్థకరణుల (Carthagenians) సామ్రాజ్యము నాశనమగునట్లుచేసిరి. మాగధులు ప్రాగ్దేశమున సార్థకరణుల సామ్రాజ్యము నాక్రమించి, యణచియుంచిరి కాని నాశనమొందింపలేకపోయిరి. కావున, మాగధులబల మణగిపోవుటతోనే, సాతవాహనులు ప్రత్యేక సామ్రాజ్యమును స్థాపితముచేసి విజృంభింపగల్గిరి.

ఈనాటకమున మాగధులు కళింగసామ్రాజ్యము (సాగరసామ్రాజ్యము) నాక్రమించుటకుచేసిన ప్రయత్నములలో నొకదానింగూర్చినదై యున్నది. అశోకుని దండయాత్రనాటికి కళింగము బౌద్ధమతమునకు ప్రధానస్థానమై యుండెను.

శ్రీకృష్ణుఁడు, బుద్ధుఁడు, క్రీస్తు, మహమ్మదు, శంకరులు, రామానుజులు, ఈ మొదలగు మహాత్ములు మహామతములను స్థాపించిరి. వీరుస్థాపించినమతముల నవలంబించిన రాజ్యములు మహాసామ్రాజ్యములై విలసిల్లినవి. యాదవమాగధ పాంచాలాది వివిధరాజ్యము లంతరించినప్పైని, శ్రీకృష్ణుని భాగవతమత మవలంబించి, పౌరవసామ్రాజ్యము సుస్థిరమైనది. బౌద్ధమత మవలంబించి మాగధులు స్థలసామ్రాజ్యమును, కాళింగులు జలసామ్రాజ్యమును సుస్థిరములుగాఁజేసికొనఁగల్గిరి. క్రైస్తవమతమవలంబించి రోమనులును, మహమ్మదీయమత మవలంబించి యరబ్బులును, ఐకమత్యమునుబొంది, సామ్రాజ్యస్థాపనము చేయఁగల్గిరి. ఈ విధముగా ప్రత్యేకమతములే ప్రత్యేకసామ్రాజ్యవిజృంభణమునకుఁ గారణములైనవి. ఈ సామ్రాజ్యవిజృంభణములలో, అశోకుని కళింగవిజయము విచిత్రపరిణామముగలదిగానున్నది. ప్రప్రథమమున బౌద్ధమతము మగధరాజ్యమువలననే వ్యాపించినది. కాని, బ్రాహ్మణులసహాయమున రాజ్యము సంపాదించిన చంద్రగుప్తునికాలమున నించుక క్షీణించిన బౌద్ధమతము, అశోకుని కళింగయాత్రవలన తిరిగి మొలకలెత్తి విజృంభించినది. మౌర్యులు కాళింగులసాగరసామ్రాజ్యము నాక్రమించినను, కాళింగుల బౌద్ధమతము మౌర్యసామ్రాజ్యము నాక్రమించి పరస్పరవిజయముకలుగఁ జేసెను. సామ్రాజ్యమతములయు, మతసామ్రాజ్యములయు, పరస్పరాక్రమణ విజృంభణము లీ విధముగా నితరమతములలోను గనఁబడుచున్నవి. కాని, బౌద్ధమతమునఁగల విశిష్టత, లోకమునకు నసహ్యా

మగు చరిత్రగల యశోకుని, పరమసాధువుగా మార్పఁగలిగిన యద్భుతశక్తియే.

రక్తపాతమునందలి లోభముచే కళింగ మాక్రమింపఁబోయిన యశోకుని పరమసాధువుగా మార్పఁగలిగినశక్తి బౌద్ధమతమునకుఁ గలుగుటవాస్తవమే కాని, యామతశక్తికన్న, కారవాకి యనిర్వచనీయ సామర్థ్యమే యంతకన్న హెచ్చుగా కారణమని చెప్పవచ్చును. సాగరసామ్రాజ్యాక్రమణము అశోకుని కళింగయుద్ధయాత్రకు కారణమేకాని, అంతకన్న ప్రబల కారణము స్త్రీలోభముగలిగి రావణునివంటివాఁడైన యశోకునకు కారవాకిపైఁగల మోహామే.

సీతరావణుని నిరాకరించి, యాతనిఁ జంపించినది. కారవాకి యశోకునిబెండ్లియాడి, యాతనిసాధువుఁగాఁ జేసి, యాతని మూలమున ధర్మరాజ్యస్థాపన మొనరించినది. కావున, ఈ రెండు స్త్రీవ్యక్తులలో, నేదిమిన్నయో నేను నిర్ణయింపలేను. కారవాకిచేసిన యీఘనకార్యము అనిర్వచనీయమై ప్రశంసాపాత్రమైయున్నది అనిమాత్రము చెప్పకతీరినదికాదు.

(2) కాళింగుల జలసామ్రాజ్యమును గూర్చియు, బౌద్ధమతమునందలి యద్భుతశక్తినిగూర్చియు, కారవాకికిఁగల చాతుర్యసౌమనస్యములఁగూర్చియు జగన్నాధరావుగారీ నాటకమునఁ దమ పరిశోధనలన్నియుఁజేర్చి, చిత్రపటమొకటి నిర్మించియున్నారు. ఆచిత్రపటమునందలి పాత్రలు మనోహరాభినయములతో యథోచితస్థానము లలంకరించి, జీవకళలుట్టిపడఁజేయుచున్నవి. సుప్రసిద్ధములైన చరిత్రాంశములే చిత్రపటముగా నల్లుట కష్టమైయుండ, నూతన పరిశోధనలకు ఫలములైన చరిత్రాంశములతో సజీవమగు చిత్రపట మల్లుట కష్టతర మని వేఱుఁగాఁ జెప్పనక్కఱలేదు. కావున, నిట్టిరచనకు జగన్నాథరావుగారెంతయును ప్రశంసాపాత్రులే. ఇఁక నీ నాటకములోని కొన్నిమంచి ఘట్టములం బరీక్షింతము.

i. అశోకుఁడు కళింగవిజయమునకుఁ బూర్వము మిక్కిలి దుష్ప్రవర్తనము కలవాఁడు. కళింగుల సాగరసామ్రాజ్యమును జయించుటకును, కారవాకినిఁ బెండ్లియాడుటకును, కళింగమును ముట్టడించి, కళింగ యువరాజును జంపి, కారవాకితో మోహపూర్వక సంభాషణము ప్రారంభించునప్పుడు కారవాకి చూపిన ధైర్యమువలనను, ఆమెచేసిన నిర్భయప్రసంగములవలనను, అశోకుని మనస్సునగొప్ప మార్పుకలిగి, యాతని చరిత్రమే మారిపోయెను.

కార:— పశుబలమునఁ బడఁతులఁబడయ నెంచిన పాపాత్ముఁ
డవు. నిను నేఁ జూడనొల్లను. తొలఁగిపొమ్ము.

అశో:— అట్టి దారుణకర్మకు నన్ను ప్రేరేపించినది ఏది ?
నీయందు నాకంకురించిన అనురాగము. కావున నాచెడు
కర్మలకునీవే కారకురాలవు ?

కార:— రాజా— ఏటి కీ వాదము ?

సీ॥ నీప్రక్కఁబుట్టిన నీయన్నఁ జంపించి,
వేడినెత్తురుగార్చు వేళయందు,
భక్తితో నినుఁగొల్చు బ్రాహ్మణమంత్రుల
వేధించి సాధించువేళయందు,
పోరి నశోకకుజంబు విఱిచి రన్నెపాన
స్త్రీలనుజంపించు వేళయందు,
ఆత్మవిలాసార్థమతిసాధువులఁ దప్త
తైలానఁ ద్రోయించు వేళయందు
నే నెకద నీకుఁ బ్రోత్సాహ మిచ్చియుంటి,
నిట్టి తుచ్ఛంబులాడెప వేల, బేల,
రక్తదాహంబుకోరు దుర్మార్గుఁడవు, పి
శాచమా, నీకుఁగారణాసక్తియేల ?
ఛీ— ఇటనుండి కదలిపొమ్ము.

అశోకుఁడు నిరంకుశాధికారము కలవాఁడగుటచే నిట్టి

సంభాషణ మిదివరకు వినియుండలేదు. వెంటనే యాతనియందు మార్పుకనఁబడినది.

అశో:—క్షమింపుము. ఇంతదనుక నా యెదుట నిర్భయముగ మాటలాడు వ్యక్తి లేకుండుటచే నిరంకుశముగ వ్యవహరించి యిట్టియపకీర్తి నార్జించితిని.

అశోకునియందు పరిణామముకలిగినది. మహాకార్యము సాధించుటకై యవతరించిన యా చక్రవర్తియందుఁగలిగిన పరిణామమే కారవాకియందును పరిణామము కలిగించినది. ఉభయులును దంపతులై ధర్మస్థాపనకు పరస్పరసహాయభూతులైరి.

2. అశోకుఁడు తనయన్ననుజంపి, అతనికి రావలసిన రాజ్యము దానాక్రమించుకొనెను. ఆయన్న చనిపోవునప్పటి కాతనిభార్య గర్భిణియైయుండి, యొకకుమారునిగనెను. ఆతని పేరు న్యగ్రోధుఁడు. న్యగ్రోధుఁడు పెద్దవాఁడై, ఉపగుప్తుడను బౌద్ధగురువునొద్ద ధర్మదీక్షగ్రహించి, తనతండ్రిని జంపించిన అశోకుని జంపింపఁబ్రయత్నించెను. ఈవిజయము రక్తపాతమునఁ గాదు, అహింసామార్గమున—. మార్పుచెందిన యశోకుని యందు ధర్మబీజములునాటి, అహింసామార్గమున కాచక్రవర్తినే ప్రచారకునిగాఁ జేయఁగల్గెను. న్యగ్రోధుని యీ మహావిజయము మిక్కిలి ప్రశంసాపాత్రము.

న్యగ్రోధుఁ డశోకుని సభాస్థలమునకరుదెంచెను. అశోకుఁడు నిదానించి చూచెను. మృతినొందిన తనయన్నగారి రూపరేఖావిలాసము లాతనియందుఁ గన్పట్టెను. నిశ్చేష్టితుఁడయ్యెను; మతిచెడి యాతనినట్లేచూచుచుండెను. భయపడి, డగ్గుత్తికతో నిట్లనెను.

"అయ్యా, ఇందలి సర్వస్వము నీది—నీయిచ్ఛకువచ్చినచోటఁ గూర్చుండవచ్చును—"

న్యగ్రోధుండు సింహాసనముపైఁ గూర్చుండఁబోవ, చేయూత యిచ్చి, యాతని నందు గూర్చుండఁ బెట్టెను.

న్యగ్రోధునకును అశోకునకును జరిగినసంభాషణము వలన, ధర్మబీజములాచక్రవర్తియందు అంకురించి, మొలకలెత్తినవి. న్యగ్రోధుఁడశోకుని జయించెను. ధర్మమార్గమున—ఆతని యాతిథ్యమంగీకరించెను. మహారాజ్యమును బరిపాలింపవలసిన న్యగ్రోధుఁడు ధర్మరాజ్యపరిపాలనకు కారణమగుట భగవంతుని చిద్విలాసములలో నొకటిగదా! ఈకీర్తి అశోకునిదా? న్యగ్రోధునిదా ?

3. అశోకుని మూలమున బుద్ధునిధర్మమార్గము లోకమున సుస్థిరమై యుచ్ఛస్థానము నాక్రమించెను. కాని, అధికారము లుచ్ఛస్థితిలోనున్నప్పుడే, వానినినశింపఁజేసెడు వ్యతిరేకముల బీజములుకూడ నంకురించియుండును. మొగలాయిప్రభుత్వముచ్ఛస్థితిలోనుండిన యౌరంగజేబు కాలముననే, యా ప్రభుత్వము నంతరింపఁజేసిన యైరోపీయుల రాయబారములు ప్రారంభములైనవి. అట్లే, బౌద్ధధర్మ ముచ్ఛస్థితిలోనుండిన యశోకుని కాలముననే, బౌద్ధధర్మము నశింపఁజేసిన బ్రాహ్మణమతబీజములంకురించినవి.

బ్రాహ్మణమతమును నశింపఁజేయుటకై బౌద్ధమత మారంభమయ్యెను. నందులు దానిని స్వీకరించిరి. నందరాజ్యమును విధ్వంసముచేసి, బ్రాహ్మణులు మరల మౌర్యరాజ్యమును స్థాపించిరి. బౌద్ధమతము మౌర్యులను జయించి, యున్నతస్థానమునాక్రమించెను. బ్రాహ్మణులు తాత్కాలికముగ నణఁగియుండి, వ్యవహారార్థముగ రాజమత మవలంబించి, తాంత్రిక యజ్ఞముల వినాశనమునకై జనించిన బౌద్ధధర్మమున, తాంత్రిక పద్ధతులఁ బ్రవేశింపఁజేసి, బౌద్ధధర్మమును జీల్చి, యా చీలికలను

వేఱుచేసి, తన్మధ్యమున మఱల బ్రాహ్మణమతమును ప్రవేశ పెట్టి, బ్రాహ్మణరాజ్యమును స్థాపించిరి. ఈ మహాకార్యమునకు కారణభూతులు బార్హస్పత్యులును, కాణ్వులును, ఈ బ్రాహ్మణ కుటుంబములు అశోకుని యనంతరము కొద్దికాలములోనే మౌర్యరాజ్యము నంతరింపఁజేసి, యూస్థలము లాక్రమించి, చక్రవర్తిత్వము నవలంబించినవి. కాణ్వకుటుంబమునకు మూలపురుషుఁడగు కణ్వశ్రీ నిర్మించిన పద్మశరణ్యమును, ఆతఁడు తపస్సుచేసిన గుహాయును, గంజాంజిల్లాలోనున్న శ్రీకాకుళతాలూకాలోని నంది గ్రామసమీపమున నిప్పుడు మన మందరమును జూడనచ్చును.

కణ్వశ్రీ

చ॥ దుగమున నన్యదేశముల ధూర్గత సాహస రంగమందుఁ బ
ల్వుర పధియించుచుండు టది లోకమెఱుంగు; స్వరాజ్యమందు సా
దరణము మీరఁగా వరణనందనమున్ విధియించి నాఁడు భూ
సురులకు బుద్ధవిగ్రహము చూర్ణముచేసిన కారణంబునన్॥

* * * *

చ॥ అతిశయ రాజ్యతృష్ణపయి నాశలుతీరక, యంతకెక్కుఁడౌ
మతమనుపేరిటన్ జనులమానసముల్ హరియింపనెంచి, యీ
గతినొనరింపఁబోలు; నటుకానియెడన్, వినరింప, మేదినీ
పతికి మతార్థమా సభలఁ బొల్గొనుచుండుట న్యాయమానొకో!

* * * *

బ్రాహ్మణులు బౌద్ధమతమందు దూరినఁగాని, యుద్దాని నంత మొందించుట కష్టముగఁ గాన్పించుచున్నది. కణ్వశ్రీ తన కులమువారిని బౌద్ధమతమునఁ బ్రవేశపెట్టి లో నుండి బౌద్ధధర్మ రాజ్యమును విడఁదీసెను. బార్హస్పత్యుఁడగు భారద్వాజుఁడు మఱియొకత్రోవత్రొక్కెను. రాజు లవలంబించిన ధర్మములకు పట్టణములలో నున్నంత ప్రభావము పల్లెలలో నుండదు. బ్రా

హ్మణులు పల్లెలలోఁ బ్రవేశించి, జనసామాన్యమునకు బ్రాహ్మ ణపద్ధతులుబోధించి క్రమక్రమముగా విప్లవముకలిగింపవచ్చును.

భర — గీ॥ పల్లెటూళ్లవిడి, పట్నాలకే తెంచి,
యున్నమాడిపోయి, ముందుఁ జెప్పుడు,
నాగరకత పేర నగరాలలో దుర
భ్యాసతతియె ప్రజలఁ బాడుసేయు॥

కానివారల కాళ్లుపట్టి పట్టణములందు పాడగుటకన్న కుగ్రామములకేగి కులవృత్తి ప్రారంభించుట సర్వవిధముల శ్రేయోదాయక మగును.

గీ॥ పట్టణాలలోన బ్రతుకఁజాలము కాని,
పల్లెటూళ్లలోనఁ బ్రతుకగలము.
పట్టణాలనుండి పాడగుకంటెను,
స్వకులవృత్తిఁ బల్లెఁ బ్రతుకఁదగదె ?

పల్లెటూళ్లలోఁబ్రవేశించి, బార్హస్పత్యులు లోనుండి ప్రచార మారంభించిరి. బౌద్ధమతమున తాంత్రికమతము ప్రవేశించుట కీ ప్రచారమే కారణమయ్యెను. ఈ బార్హస్పత్యులును, కాణ్వులును గలసి, మౌర్యరాజ్య మంతరింపఁజేసి, మగధ సామ్రాజ్య మాక్రమించి పరిపాలించిరి.

చరిత్రనాటకములలో నిట్టి విషయములు ప్రదర్శించుట కవికి మిక్కిలి కష్టతరమైనపని. ఈపని జగన్నాథరావుగారు మిక్కిలి జాగ్రత్తతో నిర్వహించిరి.

నాటకమునందలి పెద్దవిషయముల నిర్వహించుటలో నే కాక, చిన్న విషయములలోను జగన్నాథరావుగారి రచనా సామర్థ్యము కనఁబడుచున్నది. ఒక్కవిషయముమాత్రమే చూతము.

కారవాకి పరిచారికతో మాటాడుచుండెను. అశోకుఁడు ప్రక్కనుపొంచివినుచుండెను. పరిచారిక జపయుల్లుచు అద్దమును

కారవాకిచేతికిచ్చి చూచుకొమ్మని చెప్పి ప్రక్కనుపొంచియుండిన అశోకునిచేతికి తానల్లుచుండినజడయుందిచ్చి, జారిపోయెను. కారవాకి మాటాడుచు నద్దములో అశోకునిజూచి, నివ్వెరపాటొందెను. ఈచమత్కారఘట్టము మిక్కిలి రసోత్పత్తిచేయుచున్నది. ప్రభావతీప్రద్యుమ్నమునఁగూడ నిట్టి ఘట్టముకలదు. అమరుకకావ్యమునందలి యీ క్రిందిశ్లోకము గమనింపుఁడు.

శ్లో॥ కాంతేసాగసి యాపితే, ప్రియసఖీవేషం విధాయాగతే
భ్రాంత్యాలింగ్య మయారహస్యముదితం తత్సంగ మాపేక్షయా
ముగ్ధేదుష్కరమేవ ఇత్యతితరాముక్త్వాసహాసంబలా
దాలింగ్య చ్ఛలితాస్మి తేన కితవే నాద్యప్రదోషాగమే॥

యుక్తియును నలంకారము ప్రధానముగాఁగల యిట్టి రచనలు సహృదయుల హృదయములఁ గరగింపకపోవు. పై చర్చలనుబట్టి, జగన్నాథరావుగారు, చరిత్రరచించినవారిలో, నాటకము రచించినవారిలో, కవిత్వము రచించినవారిలో, సుప్రసిద్ధస్థానము నాక్రమింపవలసినవారే యని కనఁబడకతప్పదు.

ఈ నాటక మేలక్షణముననుసరించి వ్రాయఁబడిన దని ప్రశ్న—

నేఁడు కొల్లలుకొల్లలుగాఁ బుట్టుచున్న నాటకములలో నేలక్షణమును గనఁబడదు.

పదునారవ పదునేడవ శతాబ్దమునందలి యాంధ్రనాటకములలోఁగల జాతీయత విస్మృతిపాలైనది. సంస్కృత నాటకములలోఁగల సంప్రదాయము లసహ్యము లైనవి. పాశ్చాత్య నాటకములలోని భావపారిశుధ్యములు పట్టుపడలేదు. ఇఁక నేటినాటకములలో రచనయెట్లున్నదనఁగా, సగము గొరిగిన కత్తిరింపు మీసముతో, పిక్కలపైకిఁ బ్రాకుచున్న లాగుతో, నెత్తిని హేటుతో, కాలనుబూటుతో, బయలుదేరుచున్న దొరగారి వేసములవలె, యమ్మవారి సంబరాలకు బయలుదేరుచున్న వాలకము లట్లు బయలుదేరుచున్న నేఁటినాటకాలను జగుప్స

జదువ, ఇక 'నాటకాలలక్షణ మేమి?' అని ప్రశ్నించుట ఎన్ని ముంతలన్న ప్రశ్న వంటి దే-అయినను, జగన్నాధరావుగారు కొంత వరకు సంస్కృత నాటకసంప్రదాయములను, కొంతవరకు ఇంగ్లీషునాటక సంప్రదాయములను, అవలంబించి, సాధ్యమైనంత జాగ్రత్తగానే రచించిరి. ఇప్పుడు బయలు వెడలుచున్న నాటకములలో గొప్పదని యనుకొనుచున్న ఏ నాటకమునకును, లక్షణ విషయమున జగన్నాధరావుగారి యీ నాటకము తీసిపోదు. కావున, లోకోన్నత నాటకకర్త యొకఁడు బయలుదేరి యాంధ్ర భాషకును, ఆంధ్రరంగమునకును గౌరవముకలిగించువరకును, ఇప్పటిమంచి నాటకములలో జగన్నాధరావుగారి యీ నాటకముకూడ నొకటియని చెప్పవచ్చును.

నాకుజగన్నాథరావుగారు బాల్యమిత్రులు సహపాఠులు. జగన్నాథరావుగారి యీరచన నాకు మిక్కిలి యానందమును గలిగించెను. నాయందలి ప్రేమచే నీ మనవిమాటలను నాచే వ్రాయించిన నా సోదరులగు జగన్నాధరావుగారికి నే నెంతయును కృతజ్ఞుఁడను. జగన్నాధరావుగారి యీ నాటకము నాంధ్రులాదరించి, ఇంకను బెక్కు నాటకము లాయనచే రచింపఁ జేయుటకై యాంధ్రలోకమును ప్రార్థించుచున్నాను.

సోంపేట, 4—1—25. మండపాక పార్వతీశ్వరశాస్త్రి

## ఈనాటకమునందు వచ్చు పాత్రములు

---

పురుషులు:—

1. అశోకుఁడు ... మౌర్యసమ్రాట్టు.
2. న్యగ్రోధుఁడు (బాలభిక్షువు)... అశోకుని అన్నకొమారుఁడు.
3. ఉపగుప్తుఁడు ... బౌద్ధమత గురువు.
4. భారద్వాజుఁడు – గురువు ... బ్రాహ్మణ విద్వాంసుఁడు.
5. కౌశికుఁడు – మాయభిక్షువు.. మంత్రిఖల్లాటకుని కుమారుఁడు.
6. కణ్వుఁడు ... బ్రాహ్మణయువకుఁడు.

సేనానులు, కంచుకి, సేవకుఁడు, జంఘాలికుఁడు మొదలగువారు.

స్త్రీలు:—

1. కారువాకి ... మొదట కళింగ యువరాజ్ఞి. తరువాత అశోకుని ద్వితీయమహాదేవి.
2. కళింగపరిచారిక.
3. దాసి.

# కా ర వా కి



## నాంది

శా॥ శ్రీరాజిల్లెడు నర్థకామముల మైత్రిం గూర్చు ధర్మంబు, ను
ర్వీరాజన్య సుఖప్రపంచము, ముని నిర్దిష్ట కారవాకీర్ణ దు
ర్వారాధార మశోకవర్ధనము నిర్వాణైక లింగంబు, హిం
సారాహిత్య మహావ్రతంబు సుజనస్వాంతంబులన్ నిల్చుతన్.

సీ॥ స్వర్గాభిలాష యజ్ఞంబు లొనర్పంగ
రక్తప్రవాహముల్ ప్రబలునాఁడు,
బ్రాహ్మణేతరుల కర్హత లేదు నిర్వాణ
పదవికన్ వాదముల్ ప్రబలునాఁడు,
తనత్రోవయే కాని, తన కొక్కరునిత్రోవ
పలదన్న భావముల్ ప్రబలునాఁడు,
ధర్మముల్ పెక్కులై, తను నేరిధర్మంబు
వారివన్ భేదముల్ ప్రబలునాఁడు

సర్వసమబుద్ధి ప్రకటించి, సంఘశక్తి
స్థాపన మొనర్చి, దయైకతను సృజింప
నవతరించి, యహింస, సత్యమును, నిలిపె
బుద్ధుఁ డాతఁడు లోకంబుఁ బ్రోచుఁగాత.

సూత్ర:—మహాశయులారా! నేటిరాత్రి కళింగసామ్రాజ్య పతనమును, తన్మూలమునఁ గలిగిన ధర్మసామ్రాజ్య ప్రతిష్ఠాపనమును, గల కారవాకిదేవి చరిత్ర మీ యెదుట ప్రదర్శింప నున్నారము.

మహాప్రళయమునకు పూర్వము నేడు నామమాత్రా వశిష్టమై యున్న భూమధ్యఖండమున 'కుయింగ' మనుపేర కళింగముండెను. ప్రళయసమయమున భూమియుపరిభాగమున నెన్నియో మార్పులు కలిగినవి; కాని 'కొయిగ' తీర మటులే నిలిచియుండుటచే ఆనాటి 'కొయిగ' జాతి యీనాటికి సందు మిగిలియున్నది.

సరస్వతీ దృషద్వతీ నదులకు మధ్యనుండిన దేశము 'బ్రహ్మావర్త' మని మనవారు చెప్పుదురు. కాని, ఆదిమపురుషుఁడగు కర్దమప్రజాపతి కావాసమై ప్రసిద్ధిఁగాంచిన ఋషికుల్యా ప్రాంతభూమి ప్రళయానంతరము మానవజాతి మొదట నభివృద్ధిఁజెందిన స్థలమట్లు కాన్పించకమానదు. కర్దముఁడు దేవహూతితో పడవపై విహరించిన 'బిందుసరోవరము' ను, మనవా రీనాఁడు 'చిలక' సర స్సనుచున్నారు. కర్దముని కుమారుఁడగు 'కపిలు' ని యాశ్రమము నేఁటికిని మహేంద్రగిరి ప్రాంత భూములందు గోచరించును. వసిష్ఠాది సప్తఋషులు బ్రహ్మావర్తపుణ్యభూమినుండి నలుగడలకేగి యార్యనాగరకత నభివృద్ధి కావించునాఁడు మంథరగిరిప్రాంత భూములందుండిన ఋషిపుంగవులు, దక్షిణాపథమందు సంచరించుచుండిన యాదిమ జాతులతో కలసి ప్రత్యేకనాగరకత నభివృద్ధికిఁ దెచ్చిరి. దీనినే ఉత్తరాపథవాసులగు నార్యులు, ద్రవిడనాగరకత యనఁదొడఁగిరి. కొంతకాలమున కీరెండు నాగరకతలు—

(మారిషుఁడు పరుగుపరుగున ప్రవేశించును)

బావా! నీవేలవచ్చితివి? నటులందరు వేషముల ధరించి నాటకప్రదర్శనమునకు సిద్ధముగ నున్నారా?

మారి—మీ యుపోద్ఘాతము వినివిని విసుగొంది పరుగెత్తుకొని వచ్చితిని. ఇది చరిత్రవిమర్శకులకు పనికివచ్చును. కాని

వివిధతరగతుల మేధావంతులున్న యీసభవారి కంత
రుచింపదని నాయభిప్రాయము. అప్పుడే అటనిట గుసగుసలు
బయలుదేరుచున్నవి. మీరీధోరణి కొంతవఱకు సాగించి
నచో మేము వేసికొనిన వేషములు విప్పవలసివచ్చును.

సూత్ర—ఏమీ! నాయుపన్యాసమునకు విసుగొంది సభా
సదులు పారిపోవుదురనియా నీభీతి? విస్తృత కళింగసామ్రా
జ్యచరిత్ర వినుట కేభారతీయుఁడు విసుగొందును! భేరింగి
జలసంధి మొదలు బ్రిటిష్ దీవులవఱకుఁ గల సముద్రతీర
భూముల నాక్రమించి వర్తకమొనర్చిన కళింగుల ధైర్య
సాహసములకు మనమందరము గర్వింపవలసియున్నదే.

మారి—కాదన్నవారెవరయా? దేశభక్తులు, భాషాసేవకులు,
నాటకశాలనడుగిడకయే యీమాత్రము జ్ఞానము నింట
గూర్చుండి సంపాదింపగలరు.

సూత్ర—ఔను, ఆమాత్రము నాకునుఁ దెలియును. నాటక
ములు దృశ్యప్రబంధములు. చదువురానివారు తరించుటకు
అయ్యవి ముఖ్యముగా వ్రాయఁబడినవి. బాల్యమున
బడులకేగని వారి కుపయోగించు నిమిత్తము రంగస్థల
మేర్పఱుపఁబడినది. ఇదికూడ నొకవిధమైన విద్యాలయమే.
రాజపోషణ లేకుండుటచే నీనాఁడు రంగాలయములు రసిక
శిఖామణుల చేతులలోఁబడి, రసాభాసములై, పరిహాసమూ
హామునకు మేలుకన్న కీడెక్కుడు సేయుచున్నవి.

మారి—ప్రేక్షకుల మనముల నాకర్షించి వారికి నాటకములపై
రక్తిపుట్టించినచో వారి కానాటకములవచ్చు పాత్రలమీఁద
భక్తి కుదురును. అప్పుడుగదా నటుల నోఁటినుండి వచ్చెడు
నీతులు సభ్యులమనస్సుల కెక్కును. అన్నప్రాశనమునాఁడే

ఆవకాయముక్క బాలునినోటఁ బెట్టినట్లు నాటకారంభ మునసే నీచర్చనీయాంశములతో పెద్ద యుపన్యాసము ప్రారంభించినా వేమని యడుగుచున్నాను.

సూత్ర—గజ్జెకట్టి నాట్యమాడుమనియా నీయభిప్రాయము? అయ్యది నాచేతఁగాదు. నీవో మీయక్కయో వచ్చి యాపనిచేయుఁడు. నీకు దరువులు కావలెను. నే నెఱుఁగుదును.

మారి—మాకున్న మీకుండవు. అనుజ్ఞయిచ్చినచో పాట పాడుదును. (శ్రుతి వేయుదురు.)

(తెరలో) ఎవరా సంగీతము? వలదు—వలదు—

మహారాజుగారియాజ్ఞ యేమన: యుద్ధమింకను పూర్తి కాలేదు. ఇది వినోదములకు వేళ కాదు. సైనికులందఱు తమతమ ఆయుధముల ధరించి యెవరిశిబిరములకడ వారు యుద్ధమునకు సిద్ధముగ నుండవలెను. (రణభేరీ మ్రోగును.)

సూత్ర—మారిషా! వింటివా! ఆ భేరీఘోష! చండాశోకుని యతితీవ్ర ప్రకటనము. రాఁబోవు అంకమునకు సంగీతము సరిపడదని నేను మానియుండ నీవు ప్రేక్షకులయందు రక్తిపుట్టింతునని సంగీతము ప్రారంభించినావు.

మారి—నాటకములయందు సంగీత మెంతయవసరమో తరువాత చర్చింతము. రంగస్థలమున నిలిచియున్నంతవఱకు మన కీమహారాజుగారియాజ్ఞ యనుల్లంఘనీయము. రమ్ము పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు).



# కారవాకి

## ప్రథమాంకము

ప్రథమరంగము — కళింగక్షేత్రము

(అశోకుని శిబిరము. అందు చక్రవర్తి వెనుకకు చేతులుంచి యటునిటు పరిచారము చేయుచుండును. ముఖ్య సేనాధిపతులు సజ్జ నిలిచియుందురు. అశోకుని ముఖము కళావిహీనమై విచారముతో నిండియుండును).

అశో—మంచిది. నా యాజ్ఞ నెల్లఱ కెఱిఁగింపుఁడు. పట్టణములతోడను పల్లెలతోడను క్రిక్కిఱిసియున్న యీ కళింగసామ్రాజ్య మొకటి రెండు విజయములతో స్వాధీన మగునని కలనైనఁ దలంపకుఁడు. పొండు. మీమీ శిబిరములకడ అప్రమత్తులరై యుండుఁడు.

(సేనానులు నిష్క్రమింతురు).

(అటునిటు తిరుగుచు తనలో) కళింగనాయకులు మాగధ వర్తకుల మడియించి రను నెపమున నే నిటకరుదెంచితి. కాని ఎందఱు వీరాధివీరులు నేఁడు నిష్కారణముగ నిహతులైరి. (ఆలోచించి) ఇంతతో యుద్ధమాపి యింటికి మరలుదునా? (తలపంకించి) కళింగమంతయు స్వాధీనము కాకున్నపోయె, కారవాకి యైన నా చేఁజిక్కలేదె! ఈ కళింగయువరాజ్ఞి అద్వితీయ లావణ్యవతి యని గాథాగుప్తాదులు నుడువుచున్నారు. (తలయెత్తి) హా! కారవాకీ! ఇంక నెందఱిని హింసింపక నీవు నాకు స్వాధీనురాలవు

కావో తెలియకున్నది? సలసల క్రాగుచుండిన తైలఘటమున తాండవించిన బాలపండితుని మాహాత్మ్యము కన్నులారఁ గాంచిన నాఁటినుండి నాకు పశుబలముమీఁద విశ్వాస మంతరించినది.

(చారుఁడు ప్రవేశించి)

మహాప్రభో! సూర్యాస్తమయ సమయమున మీతో యుద్ధమొనర్చి మరణించిన ఆవీరాగ్రేసరులయందు కళింగ యువరాజున్నాఁడు. పడవకేతనము పట్టుకొని ఆతఁడు మరణించెను. అద్దానిని నేను తీయఁ బ్రయత్నించుచుండ మువ్వురటకేతెంచుటచే, దిగులొంది నే నిట కేతెంచితిని.

అశో—ఆవచ్చినవారు స్త్రీలో పురుషులో నీవు బాగుగ గుర్తించితివా ?

చారు—ప్రభో! ముందొక యువకుఁడు కరదీపికతో దారిచూప నొక దివ్యమంగళవిగ్రహము రణరంగమున నిర్భీతిం బ్రవేశించి పడియున్న శవములఁ బరీక్షింపఁ దొడఁగెను. ఆహారపానీయాదులఁ బట్టుకొని యామెవెనుక నొక స్త్రీ పరిచారికయు వచ్చుచుండెను.

అశో—(సంతోషముతో, తలపంకించి) వెదుకబోయిన లత కాలికిఁ దగిలినట్లయ్యెను. ఆమె నిశ్చయముగ కారవాకి దేవియే. మంచిది, సేవకా! నీవు గజయూథాధిపతికడ కేగి ఆతనిని సత్వర మిటకు పంపుము.

(చారుఁడు నమస్కరించి నిష్క్రమించును)

కారవాకి చిక్కుటన్న సంతోషముకన్న కళింగయుద్ధము

నేటితో పరిసమాప్తమొందుమనని నామనంబున నెక్కుడు సంతస మగుచున్నది.

(కనులు మూసికొని, స్మృతి సభినయించి)

ఆహా! ఎట్టి ఆజానుబాహులు! ఎట్టి వీరాధివీరులు! నేడు నిర్హేతుకముగ రణదేవతకు బలియీయఁబడిరి. (తలపంకించి)

సీ॥ రాజ్యముల్ గొననెంచి రాత్రియుం బగలును
వివిధమార్గంబులు వెదకి వెదకి,
యెండవానల కోర్చి యిల్లువాకిలి వీడి
దుర్గమస్థలముల దూరి దూరి,
పరదేశముల కేగి కరవాలములు బూని
పరవమూసాధుల నరకి నరకి,
శిశు వృద్ధుల మిగిల్చి స్త్రీల ననాథులఁ
జేసి యర్థముఁ బాడుసేసి చేసి,

గీ॥ జయముగొని, పరరాజ్య స్మశానము గని
సంతసించెద రదియేమి శాశ్వతంబొ?
మన మొరులఁగొట్ట, నొరులును మనలఁగొట్ట
నూహచేయరే, యుద్ధంబు లుడుఁగఁ దగదె?

ఈశ్వరా! కారవాకిని నాకట్టెదుటికి కొనివచ్చి మానవ కోటికి మంగళము చేకూర్చితివి. ధన్యోసి! ధన్యోసి!!

(గజయూధాధిపతి ప్రవేశించి) జయము, జయము, మహారాజా!

అశో—మిత్రమా! ఈక్షణమ నేను పాటలీపుత్రమున కేగ వలసియున్నది. మీరు నాల్గుభద్రగజముల నాయత్తపఱచి నాప్రయాణము కొనసాగున ట్లొనర్పుఁడు. శ్రద్ధవహించి నన్నుఁ జరితార్థుఁ జేయుఁడు.

గజపతి—మహాప్రసాదము. (నిష్క్రమించును)

అశో—సేవకా! మహామంత్రి రాధాగుప్తు నిటకుఁ దోడ్కొని రమ్ము.

(సేవకుఁడు నమస్కరించి నిష్క్రమించును).

(స్వగతము) రాధాగుప్తుని మంతనమునకదా నే నీకళింగమున కాలిడితిని. ఆర్జించినంత రాజ్యము ననుభవించినఁ జాలును. మాగధసేనల మగుడించి పాటలీపుత్రమునకుఁ గొనితెమ్మని రాధాగుప్తున కాజ్ఞాపించెదను. ఇఁక నేఁ జేయఁ బూనిన శాంతిప్రతిష్ఠాపనమునకు ఈ కటకు కిరాతుల దండు లేల. వారి నిటనుండియే కళింగఘాటిమీదుగ వారి వారి పూర్వనివాసంబులగు కొండల కంపెద. (తొందరగా) ఎవఁడురా! అక్కడ.

(సేవకుఁడు ప్రవేశించి) చిత్తం. మహాప్రభో!

అశో—రణరంగమున దీపమేమైన యున్నదో లేదో చూచి రమ్ము. త్వరగపొమ్ము.

(సేవకుఁడు నిష్క్రమించి— లోపలనుండి)

దీపమున్నది. మహాప్రభో! మనుష్యులుకూడా తిరుగు చున్నారు. ప్రభో! కరదీపికతో బాలభిక్షువు మాత్ర మొటకో అరుగుచున్నాఁడు.

అశో— లవిలంబ మొనర్చిన కార్యము చెడిపోవును. (నిష్క్రమించును.)

(యవనిక జారును)

# కారవాకి

## ప్రథమాంకము

ద్వితీయరంగము — కొత్తూరు యుద్ధభూమి

(పడియున్న పతిశవముకడ కారవాకి కూర్చుండి యుండును. పరిచారిక ప్రక్కనె నిలువబడి యుండును.)

పరిచారిక— అమ్మా, ఎంత ఏడ్చిన నేమిలాభము? బాలభిక్షువు చెప్పినట్లు ఎవరి నిర్వాణమునకు వారే ప్రయత్నింపవలసి యుండును. ఎంతకాల మీ మృతకళేబరముకడ పడియుండినను ఏమి ప్రయోజనము! అమ్మా, లెమ్ము—మనకు ఋణము తీరినది; రమ్ము, రాజపురమున కరుగుదము.

కార—పొంగిపొరలి వచ్చుచున్న ఈ వియోగదుఃఖము నాపుకొన నాకు శక్యము కాకున్నది.

గీ॥ కనుల కరవుదీరఁ గాంచెద నొకసారి
నాథు ముద్దుమోము — నాతి నిలుము
కదలిపోవు వెనుక గనసేమి కల దంత
కారమొకటి తక్క కాంత నాకు॥

పరి—అమ్మా కాలగతి మీరఁ నేరితరము? ఇట, నుండి నంత కాలము నీదుఃఖమున కంతముండదు (చేయిపట్టుకొని లేవదీయ ప్రయత్నించును. కారవాకి చేయి వదలించుకొని, చేతులతో కన్నులుమూసుకొని దీర్ఘనిశ్వాసములేయును—పరిచారిక యువరాజు మోమును కప్పియున్న కళింగపతాకము నించుకంత తొలఁగించి:)

(ప్రకాశముగా) అమ్మా! కాంచితివా కళింగరాజు మోము.
మరణించినను ముద్దులు మూటకట్టి నట్లున్నది.

కారవాకి—(పతిశవముపై బడి మోము ముద్దాడి, మూర్ఛ నొందును)

పరిచారిక—(పైట చెంగుతో దేవికి విసరుచు ప్రక్కనిలువబడి) యౌవనవతికి పతివియోగము మిగుల దుస్సహము. ఇట్టి అనుకూల దాంపత్య మున్నపట్ల నయ్యది మరియు దుర్భర మగును. ఆహా! మా దేవి ఈవిపదంబుధి నె ట్లీదగలదో? కొమరులుండిన కొంతమాట—కాలమే కష్టముల గట్టె క్కింప గలదు.

(ఎడమ చేతియందున్న కళింగ పతాకమును వీక్షించి:)

ఆరు వందల సంవత్సరములనుండియు నద్వితీయముగ నన్నితావుల ప్రకాశించుచుండిన కళింగపతాకమా! నేడు నీ కెట్టిగతి పట్టినది! హాతవిధీ, నీ చెయిదములకేమనవలెను.

(పతాకము పట్టుకొని)

శా॥ నానాద్వీపములందు రాజ్ఞివయి విన్నాణంబునన్ స్వేచ్ఛ నెం
తేనిన్ సంచరణంబొనర్చుచు దివిన్ దేదీప్య మానంబుగా
నేనాఁడున్ వెలుగొందుచుండిన కళింగేశధ్వజంబా, నినున్
జానల్ మౌర్యునిరాజ్యతృష్ణవలనన్ సంరక్షకున్ బూనిరే!

(పతాకమును ముద్దాడి)

కోట్లకొలది ప్రజలచే ప్రాణతుల్యముగ ప్రేమింపబడుచుండిన మా 'పడవకేతనము' ను పాపిష్ఠి మాగధులచేత పడనిత్తునా ?

(దానిని జాగ్రత్తగా మడత పెట్టుచు)

యువరాజా! ధన్యోసి! ప్రాణములఁ గోల్పోతివిగాని

పతాకమును వీడవైతివి. కళింగుల గౌరవమును కాపాడి నీజన్మ సార్థక మొనర్చుకొంటివి. దేవి మూర్ఛదేరకమునుపే నేనీ పతాకమును భద్రపఱచెదను.

గీ॥ మాగధీయుల చేఁటి యీ మత్సరంబ
దెన్నటికినైనఁ దొలఁగి పోకున్న, యపుడు
మరల నెగురవె మునుపటి మాద్రి నీవు ?
దాచి యుంచెద నిన్ను నందాక, రమ్ము ॥

ఇద్దాని సంరక్షణార్థమై నే డెందఱు కాళింగులు ప్రాణముఁ గోల్పోయిరి! (వినుట నభినయించి) ఎవ్వరో వచ్చుచున్నట్లున్నది. (పతాకమును పైటచెరగున భద్రపఱచును. )

(ఇరువురుభటులు ప్రవేశింతురు)

ఊఁ— ఎవరు వచ్చిననింకేమి భయము!

(బిగ్గరగా) ఎవరుమీరు ? మీకిచ్చట పనియేమున్నది ?

కార—(ఇంచుక మూర్ఛదేరి, నాథుని శవమును గట్టిగ పట్టుకొని) నేను చెంతనుండ నానాథుని మీరెట్లు పోకగలరు?

చేటి—(కారవాకిని చేతితో తట్టి) అమ్మా! అమ్మా!

కార—(లేచి కూర్చొని ఒకచేయి శవముపైనుంచి యింకొక చేతితో వచ్చిన భటుల నాపుట నభినయించుచు—కనులు విప్పి) ఆఁ ఎవరు మీరు? మీ ఆకారమునుచూడ నాకు భయమగుచున్నది. మాటాడరేమి !

భటు—అమ్మా! మిమ్ముకొనితెమ్మని రాజుగారి యాజ్ఞయైనది. విచ్చేయుఁడు.

కార—(తనలో) మాటాడుచుండిరి కాన మనుజులే కావలెను.

యమ భటులు కారనుట నిశ్చయము. (ఆలోచించి-ప్రకా
శముగా) రాజెవరు ? ఆతనికి నాతోనేమి పని?

(తనలో) నాసహాగమనోద్దేశము గుర్తెఱింగి కళింగ
సార్వభౌముఁడు వీరల నిటకంపియుండునా ? (భటులను
బాగుగ పరికించి) వీరు కళింగయోధులట్లు కాన్పింపరే.

భటు—అమ్మా! ఆలస్యమొనర్చినచో అశోకచక్రవర్తి మాపై
నాగ్రహించును.

కార—(ఆగ్రహముతో లేచి నిలిచి—గంభీరముగా) ఏమీ
మీరు అశోకుని భటులా? నన్నాజ్ఞాపించుటకు అశోకుఁ
డెవఁడు? (తలపంకించి) కళింగ సీమను కాలిడనిచ్చినందు
లకు కండక్రొవ్వెక్కి మిన్నుమన్నుకానక మాటాడు
చుంటిరా? పొండు-ప్రాణములపై నాసలున్న సత్వరమిట
నుండి కదలి పొండు.

(పడియున్న ధన స్సందుకొని బాణము సంధింపజూచును)

భటు—ఈమెను ప్రాణములతో కొంపోవుట కష్టసాధ్యము.

ద్వితీ—రాజు వలచిన రమణిని స్పృశించు టెటుల ?

(మెల్లగ నవ్వలికరుగుదురు)

కార—ఇట్టి భీరువులతోడనా అశోకుఁడు మాకాళింగుల
స్వతంత్రత నపహరింప యత్నించుచున్నాఁడు! పరిచారికా,
నీవును శస్త్రపాణివైయుద్ధమునకు సిద్ధముకమ్ము(ఆలోచించి)
వలదు, వలదు: నీవు నానాథుని శవమును కనిపెట్టుకొని
యుండుము. నేను వెంటాడి ఆ యిరువురు భటుల నంత
మొందించి వత్తును. లేకున్న వారేగి అశోకుని ఇటకుఁ
దోడ్కొని వత్తురు.

(కారవాకి ధనుష్పాణియై భటుల నెంబడించును.)

(పరిచారిక శవముకడ శస్త్రపాణినియై నిలువఁబడి యుండి)

కారవాకిదేవియే నేఁడు యుద్ధమున కేతెంచియుండిన అశోకునకు జయము ప్రాప్తింప కుండెడిది. ఈమె కరకౌశలమున కీడులేదు. ద్వంద్వయుద్ధమున కళింగయువరాజీమెను జయించినతరువాతకదా యీమె యూతని వివాహమాడుట కంగీకరించెను. నాయులు వీరులైనగాని కళింగసీమయొక్క స్వాతంత్ర్యము నేటినుండి నిలుచునని తోచదు. పతులు గతించిన పడతులు పురుషత్వమూనవలసి వచ్చును.

(లోపల కలకలము—కారవాకి కంఠరవమున)

ఛీ! భీరువా! వెనుకవాటునుండి వచ్చి న న్నొడిసిపట్టితివా! మూతిపైమీసమున్న ముందునకువచ్చి నిలువఁబడుము. ఖడ్గమే యుండిన నిప్పట్టున నీకంఠము దునిమియుందును.

పరి—(ప్రక్కనున్న యవనికకడకేగి చూచుట నభినయించి) ఆఁ—, ఆఁ—, అదేమి! అదేమి—(ఏడ్చుచు) ఆపురుషుఁ డెవ్వఁడు —మా దేవి నెత్తుకొనిపోవుచున్నాఁడు.

(లోపలికి పరుగెత్తును—యవనిక జారును).



# కారవాకి

## ప్రథమాంకము

తృతీయరంగము: యుద్ధభూమి.

(కళింగపరిచారిక విషాదముతో నిలిచియుండును)

బాలభిక్షువు (పాడుచు ప్రవేశించును)

హింసయొనర్పఁగ నెంచెదరేటికి
హీనబుద్ధులై జనులారా,
హింసను మించిన పాపము లేదని
యెరుఁగ రేటికో జనులారా,
నోరులేని జంతువుల పీకలను
నులిమినైతురే జనులారా,
పారెడు నెత్తురు కాలువలం గని
పగులవె గుండెలు జనులారా
స్వర్గఫలం బెపుడో కలదంచును
భావించెదరే జనులారా
స్వర్గం బౌనే రక్తముగారెడు
జంతుల చూచుట జనులారా ॥

పానీయమిచ్చి పదిమంది ప్రాణములఁ కాపాడఁ గలిగితిని.
(వెనుకకు తిరిగి) చేటీ! మీ దేవి ఎక్కడ ?

చేటి—అయ్యా! (విచారముతో) మీ రాహారపానీయములఁ గొని వెడలిన రెండునిముషముల కెవ్వరో యేతెంచి మన దేవిని రాజుకడకు రమ్మని బలాత్కరించిరి. ఆమె ఆగ్రహించి వారిని శస్త్రపాణియై వెంటాడెను. ప్రక్క పొంచి

యుండిన యొకపురుషుఁ డేతెంచి మనదేవి నెత్తుకొని పోయెను. నేను వానిని వెంబడించి కొంత దవ్వరిగితిని. కాని యాతఁడు మనదేవిని గజముపైనెక్కించి అతిత్వరితముగఁ గొంపోవుటచే నే మరలివచ్చితిని.

న్యగ్రో—చేటీ, దిగులొందకుము—(ఆలోచించి),
ఈశ్వరుఁడు ఈ కీడునందు మనకు మేలుచేకూర్పనున్నాఁడు. దుఃఖము దిగమ్రింగి నే నడుగుప్రశ్నలకు సమాధాన మిమ్ము? నీ వాపురుషుని జూచితివా ? ఆతఁ డెట్లున్నాడు?

చేటి—ఆతఁడు మధ్యవయస్కుడైనట్లున్నాడు. విశాలవక్షస్థలము కలిగి, మంచిదుస్తుల ధరించియున్నాఁడు. మీరేగు దనుక ఆతఁడిట నెటనో పొంచియుండి వచ్చినట్లు నే నూహింతును.

న్యగ్రో—(తనలో) చోరులు కారనుట నిశ్చయము.
(ప్రకాశముగా) మంచిది. పరిచారికా! నీవు శౌఘుడమున కరుగుము. నే నాగజమును వెంబడించి, దేవిని విడిపించి తెచ్చెద.

చేటి—శరవేగమునఁ బోవుచున్న ఆ గజరాజంబును మీరు కలయుట కల్ల. దేవితోపాటు దైవతుల్యులగు మీసాంగత్యముకూడ నాకులేకున్న, నేను జీవింపఁగలనా! క్షమింపుఁడు. మీరుపోవలదు. (మోకాలిపైబడినమస్కరించును) ఈ యుద్ధమూలమున కళింగముయొక్క పశుబలమెంతయో నశించినది. కాని మిముఁబోంట్లు నిలిచియుండుటచే కళింగసీమ ఆధ్యాత్మికశక్తి అంతరింపలేదు.

న్యగ్రో—నా వెఱ్ఱిబిడ్డా! అసంఖ్యాకములగు సేనలతో నెత్తి

వచ్చి అశోకుఁ డొనర్పలేని కార్యము, కాషాయవస్త్రధారినగు నే నొక్కఁడను పాటలీపుత్రమున కేగి యొనర్పఁగల నని నాదృఢవిశ్వాసము. కత్తిఁబూని ఆతఁడు కావింపలేని కార్యము సాదుమార్గమున నేను సాధింపయత్నింతును. నైవానుగ్రహముండిన అశోకుని నవలీల నాయెదుట మోకాళ్ళపై బడఁజేతును.

చేటి—ప్రభో! మీరు సర్వశక్తులరు. మీ మూలమున ప్రపంచమునకు మంగళము చేకూరుఁగాక! ఈనిరుపాలిని గూడ మీ వెంటరానిండు. మీకు మార్గమధ్యమందు సపర్యలొనర్చి నాజీవనము ధన్య మొనర్చుకొందును. ప్రాప్తముండిన మాదేవినిగూడ నటఁగాంచఁ గలుగుదు నేమో.

న్యగ్రో—అట్లైనరమ్ము, కాని నీవు నన్ను వెంబడించుటకు పూర్వము సర్వసంగపరిత్యాగ మొనర్చి బౌద్ధదీక్షఁ బూనవలెను (ఆలోచించి) మేము పూనిన ధర్మసామ్రాజ్య ప్రతిష్ఠాపనమునందు నీవుకూడ నొక ముఖ్యపాత్రధరింప వలసివచ్చును.

చేటి—అంతకన్న నాజన్మకు పరమావధి యున్నదా!
(నమస్కరించి) మహాప్రసాదము! అటులే యొనర్తును.
(నిష్క్రమించును)

న్యగ్రో—(ఆలోచించుచు - అటునిటు ప్రచారము చేయుచు)

చ॥ పలుకులు తేనెబిందువులు; భావము రాజుచునుండు వహ్ని; లో
తలపులు వహ్నికీలలు; ప్రదర్శనముల్ బహుచిత్ర నాటకం
బులు; చలదృష్టులున్ నిశితపుంఖశరంబులుగా వెలుంగు చె
ల్వలను వివేకులౌ పురుషవర్యులు నమ్మి చరింప రెన్నఁడున్॥

(నిష్క్రమించును) యవనిక జారును.

---

# కారవాకి

ప్రథమాంకము 　　　　　　　　　　　　　　　　　　చతుర్థరంగము

ఋషికుల్యానదీ తీరమున బౌద్ధాశ్రమము.

(ఉపగుప్తుఁడు శిష్యబృందముతోఁ గూర్చుండియుండును. చారుఁడు ప్రవేశించి నమస్కరించి)

మహాత్మా, సమీపనగరమందున్న వైశ్యరాజమండలి నన్ను మీ కడకంపెను. ఆ మహానగరమందు కంటఁదడిపెట్టని యింటివారులేరు. మొన్న జరిగిన కొత్తూరుయుద్ధమందు లక్షకు ఎక్కుడుగ కళింగులు మరణించుట మీరు కన్నులారఁ గాంచి యుందురు. యువరాజు మరణించెనన్న వార్త వినవచ్చెను గాని, యాతని రాణివాస మేమయ్యెనో తెలియక ప్రభువు తల్లడిల్లు చున్నాఁడు.

కన్నుల వైభముగ నుండిన కళింగసామ్రాజ్య మన్ని విధముల నభాగ్యదశయందున్నది. మీ రెట్లైన అశోకుని కడకేగి యాతని శాంతిపఱుపకున్నఁ గళింగము స్మశానవాటిక కాఁగలదని కళింగకరణులు దిగులొందుచున్నారు.

**ఉప**—యువరాజ్ఞియగు కారవాకిని అశోకుఁడు బలవంతముగ నెత్తుకొని పోయినట్లు న్యగ్రోధుఁ డిప్పుడే చెప్పియుండెను. అశోకుఁడు కళింగయుద్ధము కూడ నాపుఁజేయ నాజ్ఞయిచ్చి నట్లు వినినారము. అందుకుఁ దార్కాణముగ మాగధ సేనలు మనతీరమునుండి మగిడిపోవ ప్రారంభించినవి. (ఆలోచించి) ॥పార్షదుల రాజ్యతృష్ణ పశ్చిమ కర్ణాటమును* బాడొనర్చెను. మాగధుల రాజ్యతృష్ణ మనకర్నాటమునకు విఘాతము కలిగించెను.

॥(Persians) *(Canaan)

చారు—నందులు కళింగముపై దండెత్తి వచ్చినప్పుడు వారు. జైనమునుల శిలావిగ్రహముల మాత్రమే కొంపోయిరి. వారు జయించిన ఉత్తరకళింగమును గంగరాయని పాలనం బున నుంచియుండుటచే దేశమునకుమాత్రమెట్టి యరిష్టము లేకుండెను. ఈ నాఁటి కళింగయుద్ధమందు మరణించిన వారిసంఖ్యకన్న ఖయిదీలొనర్చి కైకొనఁబడినవారి సంఖ్య అధికముగ నున్నది. నిత్యకల్యాణము, పచ్చతోరణముగ నుండిన కళింగతీరమునం దెటఁ గాంచినను నేఁడు పాడు పడిన పల్లెలు, పట్టణములే కాన్పించుచున్నవి. కత్తిపట్టి కయ్యమొనర్చినవారిని ఖైదొనర్చుట పాడిగాని, నిరాయు ధులైయింటఁ గూర్చుండిన అబలలను, బాలురను బలా త్కారముగఁ గొనిపోవుట ఏటి న్యాయము ?

ఉప—"యథారాజా తథాప్రజాః" యనినట్లు అశోకుని మార్గమే వారును అవలంబించియుందురు. నందులొనర్చి నది 'లోభవిజయము'; అశోకునిది 'అసురవిజయము'. యుధిష్ఠిరునితో ఆర్యావర్తమున 'ధర్మవిజయము' అదృ శ్యమైనది.

చారు—ఆర్యా! ధర్మవిజయ మన నెట్టిది ?

ఉప—జయించిన రాజుల స్వాతంత్ర్య మపహరింపకుండ వారిని "జితోస్మి" యనిపించి విడిచిపుచ్చుట ధర్మవిజయమందురు. అందువలన వివిధజాతులయందు అన్యోన్యత ఎక్కుడు కాలము నిలిచియుండును. లోకకంటకుఁడుగ నుండిన వాలిని జంపి సుగ్రీవునకు శ్రీరాముఁడు కిష్కింధారాజ్యమొసఁ గెను. అటులే రావణ సంహారణమొనర్చి విభీషణునకు

లంకాధిపత్యమిచ్చెను. కాని వారి వారి రాజ్యములాక్ర మించి యచ్చటి ప్రజల నాజన్మదాసులుగ నొనర్పలేదు.

చారు—చిత్తము. మీరును ప్రియత్నించి అశోకునిచే ధర్మ సామ్రాజ్య ప్రతిష్ఠాపనమొనర్పఁ జేయించిన కళింగులకు శాశ్వతసౌఖ్యము చేకూర్చిన వారగుదురు.

ఉప—నేఁడే నేను శిష్యబృందముతో మగధకేగి ధర్మ సామ్రాజ్యప్రతిష్ఠాపనమునకు యత్నించెదను. కాని కళింగమం గుండిన దీపకరణులు సార్థవాహులు కలసి యొకజాతిగ మారినఁగాని ఆంధ్రావని కభివృద్ధి కలుగనేరదు.

చారు—చిత్తము. సమీప నగరమందున్న గోభారకోమటుల కును, కళింగకోమటులకును మీయభిప్రాయమెఱిఁగించెదను.

ఉప—గంగానదీ ముఖద్వారమందున్న ఉష్ట్రికరణులు మాగ ధులతోడను, ఉత్తర కళింగమందున్న ఆటవికుల తోడను ఎక్కుడుగఁ గలసిపోవుటచే వారి ప్రత్యేక వ్యక్తిత్వము అచిరకాలమున నంతరింపఁగలదు. నేఁటినుండి కళింగమునకు ఈచిరకసరస్సే ఉత్తరసరిహద్దగును. కావున కాళింగులు, కరణులు నింక కృష్ణాకోతవరి నదులమధ్యనున్న అంతరుల (ఆంధుల) తో నేకమైనఁగాని దక్షిణాపథమందున్న ద్రవిడ జాతులకు అభివృద్ధికలుగ నేరదు కోతవరినదియే నేఁటినుండి మనవారెక్కుడుగ వర్తకమార్గముగ నుపయోగింపనగును. కాలక్రమమున నయ్యది దక్షిణ గంగయని ప్రసిద్ధినొందఁ గలదు.

చారు—మహాత్మా! మీ ప్రయత్నములు ఫలించుగాక! నేఁ బోయివచ్చెద.

ఉష—యుద్ధముల క్రింద ఖర్చు పెట్టఁబడుచుండిన ద్రవ్యము మరి యే సత్కార్యముల కైన వినియోగింపఁబడినచో అనతి కాలమున ఈ పాపపూరితమైన భూమి పరమపవిత్రమగు స్వర్గము కాఁగలదు. యుద్ధము పశుప్రాయులగు అనాగరిక జాతులొనర్పవలసిన కార్యము. ఈ మారణకృత్యమునకు మానవకోటి మేధాశక్తి అంతయు వినియోగింపఁబడు చున్నది. ఈశ్వరా, అనుగ్రహించి నేఁటితో ఆర్యావర్త పుణ్యభూమిని మరియుద్ధములు లేకుండఁ జేయుము!

(నిమీలిత లోచనుఁడై ధ్యానించుచు కూర్చొని యుండును)

(యవనిక జారును)

———

# కౌ ర వా కి

## ద్వి తీ యాం క ము

### ప్ర థ మ రం గ ము

పాటలీపుత్రమున కోటయందలి విద్యాపీఠము

(గురుప్రతివాసీపై కూర్చుండియుండును. కొందఱుశిష్యులు చదువుకొనుచుందురు. అందొక పెద్దశిష్యుఁడుగురువుయొద్దకూర్చుండి)

శిష్యు — గురువర్యా, శాస్త్రమునకును ఆచరణమునకును ఎంతయో వ్యత్యాసమున్నట్లుకనఁబడుచున్నది. సంఘమును అరాజకమునుండి సంరక్షింపఁగలిగినంతకాలము రాజుపన్నులఁగైకొనుట కర్హతకలిగియుండునని మీరు సెలవిచ్చియుండిరి. అట్టిరాజే అకృత్యములను ప్రారంభించి దేశము నరాజక మొనర్చిన వాని నేమి చేయవలెను ?

గురు — ప్రజలయం దైకమత్యముండిన నట్టిదుర్మార్గు నవలీల సాధింపనగును. దేశమందు దుర్మార్గు లున్నంతకాలము రాజుండక తప్పడు. కాని యాతఁడు తగినంత విద్యావంతుఁడును, వివేకియు కాకుండిన అతనివలన మేలుకన్న కీడు మన కెక్కుడు కలుగును. .

శిష్యు — 'కంచెయే చేను మేయఁదొడఁగినఁ గాఁపేమి చేయఁగలఁడు?' సంఘమం దంతఃకలహములు లేకుండఁ జేయవలసిన రాజు తానే స్వయముగ సామ్రాజ్యమందలి వివిధ జాతులకును, మతములకును మనస్పర్థలు కల్పించిన నాతని నేమనఁ గలము !

గురు — వెఱ్ఱివాఁడా! ఎంతకాల మాతఁడు ప్రజలను తెర

వెనుకనుండియాడింపఁగలఁడు. నీవలన కార్యమగునని నిన్ను నేఁడు చేరఁదీయును. నా వలనఁగార్యమున్న నన్ను రేపు చేరఁదీయును. తుదవఱ కొక్కనినే నమ్ముకొని యున్న 'ఏకు మేకగు' నను భీతిచే రాజు తన నిరంకుశాధికార నాటక ప్రదర్శనమునకుఁ బనికివచ్చిన పాత్రములనే చేరఁదీయుచుండును. ప్రజల విశ్వాసమును గోల్పోయినరాజు తన పోయిన ప్రతిష్ఠ తిరుగ తెచ్చుకొనుటకెల్లె తడబాటు పడుచుండును. ఆత్మ విశ్వాస మంతరించిన వ్యక్తి కితరులపై విశ్వాస మేల యుండును ?

సీ॥ మెచ్చు మాటలఁగూర్చి యిచ్చకంబులు నల్కి
 వారల నెంతేని గారవించి
తమ పనుల్ గావింపఁగగు వారలను జూచి
 యతిమాత్రమగ వారి నాదరించి
కొండెమ్ము లాలించి కోపంబు వహియించి
 నిర్దోషులగువారి నెట్టనెంచి
నిన్న నన్నంబిల్చి, నేఁడు నిన్నంబిల్చి,
 పనితీర నుభయులఁ బంపినైచి
గీ॥ ఆత్మవిశ్వాస మిసుమంతయైన లేక
 హితుల నహితుల, నహితుల హితులఁ జేసి
 పెంపు గనసెంచు రాజుల విశ్వసించి,
 కొలుచు మూఢాత్మ లిహపరమ్ములకుఁ జెడరె.

శిష్యు—అయ్యా! రాజు హద్దుమీరి ఇట్టి అక్రమము లాచరింపకుండ మనవారు కట్టుబాట్లేల చేయలేదు ?

గురు—చేయకేమి. రాజు శ్రుతి, స్మృతి, శిష్టాచారముల ననుసరించి వ్యవహరింపవలెను. ఆతనికి సంశయమైనచో

వయోవృద్ధులు, విద్యావంతులు ఐన వారితో నాలోచించి కార్యాచరణమునకుఁ గడంగవలెను. ద్విజులును, సద్వర్త నులును అనుసరించుమార్గములే మనకు ధర్మసూత్రములు. పౌరవులంతటి మహాసామ్రాజ్యమేలినను ఎన్నఁడును లోక కంటకులు కాకుండిరి.

శిష్యు—ఐన మౌర్యులిట్లేనాఁడు వ్యవహరించుటకుఁ గారణ మేమి ?

గురు—మగధసామ్రాజ్య మందినాఁడున్న అసంఖ్య సేనలే అశోకుని నిరంకుశు నొనర్చినవి. యవనులు ఆర్యావర్త పుణ్యభూమి నాక్రమింతురన్న భీతిచే చాణక్యాదులు సామ్రాజ్యమందు యుద్ధపరికరముల నభివృద్ధిగావించి, సామ్రాట్టునకు చతురంగబలముపై సర్వాధికార మొసం గిరి. ఐనను ఐదువందల మహాబుద్ధిమంతులుగల మంత్రి పరిషత్తుమాట జవదాటరాదని శాసించియుండిరి.

నిరంకుశముగ వ్యవహరింపనెంచి అశోకుఁడు అన్న దమ్ముల నంత మొందించినటులే మంత్రిమండలిని కూడ నామమాత్రావ విశిష్టము నొనర్చెను. అందుచేత ఆర్యా వర్తమున నేఁడతఁడాడినది ఆటయు, పాడినది పాటయునై నెగడుచున్నది.

శిష్యు—కళింగ విజయ మీతనిని మరింత నిరంకుశు నొనర్చె నేమో ?

గురు—ఈశ్వరానుగ్రహముండినఁ గళింగయుద్ధమే ఈతని కడసారి క్రూరకృత్యమేల కాఁగూడదు. ఈతఁడింతులపై నింతుల దొంతరలుగ గట్టుకొనుచున్నాఁడు. కాని, అంత్య

కాలమునఁ దనకు రాఁబోవు అవస్థయెఱుఁగఁడు కాఁబోలు! దశరథునంతటివాఁడు అంతఃపురకలహములచే అవసాన కాలమందు కన్నకొడుకులఁ గానల కంపవలసివచ్చెను. ప్రపంచమున ప్రయోజకులమని విఱ్ఱవీఁగు వెట్టి యయ్యా లెందఱో అంతిపురమున అమ్మగారికి దాసానుదాసులై యుందురు. ముదిమి హెచ్చిన మన మహారాజునకీ మహా దేవి ముక్కుతాఁడు కాఁగలదు.

శిష్యు—అగ్రమహిషి యగు నసంధిమిత్రా దేవి యంతిపురమున నప్పుడే గుసగుసలు బయలు వెడలుచున్నవి. విదిశా పురమును విడిచివచ్చుటకా సఖ్యకొమారి అంగీకరింపలేదు కదా. కారవాకి దేవి కాళ్ళుపట్టుకొనినమైన నామెను వివాహ మాడకున్న అశోకున కంతిపురమున నాధార ముండ దనుచున్నారు.

గురు—ఎవరి మూలముననో యొకరి మూలమున చండా శోకుఁడు ధర్మాశోకుఁడుగ మాఱినఁగాని మాగధులకు మనశ్శాంతి చేకూరదు.

(లోపల) మహారాజులుంగారు అంతిపురమునకు విచ్చేయు చున్నారు. (అని మూడు సార్లు వినఁబడును)

గురు—ఇంక మనము పాఠశాల మూయవచ్చును.

(అందఱు నిష్క్రమింతురు)

---

# కారవాకి

## ద్వితీయాంకము

ద్వితీయ రంగము　　　　　　　　రాజాంతఃపురము

(కారవాకిదేవి కూర్చొనియుండును. అశోకుఁడు కొంత దూరమున నిలిచి యుండును)

కార—(ప్రక్కకుఁ దిరిగి పరోక్షముగ) పశుబలమున పడతులఁ బడయనెంచిన పాపాత్ముఁడవు. నిను నేఁజూడనొల్ల; తొలఁగి పొమ్ము.

అశో—దేవీ! నేఁ జేసినది కడు దుష్టకార్యమని నే నెఱుంగుదును. కాని అట్టి దారుణ కర్మకు నన్ను ప్రేరేపించినది ఏది ? నీయందు నా కంకురించిన యనురాగము.

కార—అబ్బా! అటులనా!

అశో—కావున నా చెడుకర్మములకెల్ల నీవే కారకురాలవు.

కార—కాదు, కాదు; నన్నిట్లు సృష్టించిన ఈశ్వరుఁడే నీ చెడు కర్మములకు కారకుఁడనిన సమంజసముగ నుండునేమో ?

అశో—అది యెట్లు ?

కార—నేను కురూపిగ సృష్టింపఁబడియుండిన నీవు నన్నాసించి యుందువా? నా కొఱకై వేనవేలు ప్రజలకారణముగ హింసింపఁబడియుందురా ?
కళింగ యుద్ధమునకు నేనే కారణమని

సీ॥ నీప్రక్కఁ బుట్టిన నీయన్నఁ జంపించి,
వేడినెత్తురుగార్చు వేళయందు,
భక్తితో నినుఁ గొల్చు బ్రాహ్మణ మంత్రుల
వేధించి సాధించు వేళయందు,
పౌరి నశోకకుజంబు విరిచి రన్న నెపాన
స్త్రీలను హింసించు వేళయందు,
ఆత్మ విలాసార్థ మతిసాధువులఁ దప్త
తైలాన, ద్రోయించు వేళయందు,
నే నెకద, నీకు బ్రోత్సాహ మిచ్చియుంటి,
నిట్టి తుచ్ఛంబు లాడెదవేల, జేల !
రక్త దాహంబు కోరు దురాత్ముఁడవు, పి
శాచమా! నీకుఁ గారణాసక్తి యేల ?

నీ వొనర్చినఁ భాతృవధకు కారకు లెవరు! బ్రాహ్మణ మంత్రుల హింసించినందునకు ఎవ్వరు నిన్ను ప్రోత్సహించి రందువు? కోటలోని యశోకవృక్షశాఖలు విరచిరన్న నెపమున నబలల హింసించిన యప్రయోజకుఁడవు! విలాసార్థ మొదలు సాధువుల తైల ఘటమున వేయించితివో జ్ఞాపక మున్నదా ? రక్తదాహము కోరు పిశాచమవు నీవు. నీకు కారణములతో పనిసక్తి ఏమున్నది! కళింగ యుద్ధమునకు కారవాకి కారకు రాలని పలుకుచుంటివా? ఛీ - మూర్ఖా! పొమ్ము—ఇటనుండి కదలి పొమ్ము.

అశో:—(ఆలోచించుచు కొంతతడవట్టె నిలువఁబడి) (మెల్లగా) దేవీ! క్షమింపుము. ఇంతదనుక నా యెదుట నిర్భయముగ మాటాడువ్యక్తి లేకుండటచే నిరంకుశముగ వ్యవహరించి యిట్టి యపకీర్తి నార్జించితిని.

కార—ఔను - యుక్తాయుక్త విచక్షణులగు బ్రాహ్మణ మంత్రులను పరిత్యజించి యన్యజాతులవారి మంత్రాంగ మవలంబించిన నాఁటినుండియు మౌర్యసామ్రాజ్యమున కిట్టి దుర్గతి పట్టినది. స్వలాభాపేక్ష గలవారు పజ్జనుండినంత కాలము రాజును సన్మార్గమున సాగనిత్తురా !

అశో—దేవీ ! నేను బ్రాహ్మణమంత్రుల మూలఁబట్టించుటకు కారణము కలదు. సావధానచిత్తవై, న న్ననుగ్రహించిన విన్నవింతును———మా తాత చంద్రగుప్తునకు ఈ మగధ సామ్రాజ్యము బ్రాహ్మణుఁడగు చాణక్యునివలననే ప్రాప్తమైనను, తుద కాతనికి బ్రాహ్మణుల ప్రభావము ప్రాణగండమయ్యెను. అవలీల యవనుల నార్యావర్తమునుండి యుద్వాలికంపఁగలిగిన మహాయోధాగ్రణికి సామ్రాజ్యమున నించుకంతైన స్వతంత్రత లేకుండెను. వేయేల మాతాత భద్రబాహుఁడను జైనమునితో ప్రసంగించినందుకు, మంత్రిమండలి చంద్రగుప్తుని బలాత్కరించి, కొమరుఁడగు బిందుసారునకు యాతనిచే పట్టముగట్టఁజేసెను. అంతతో నూరకుండిరా? సామ్రాజ్యాంతర భూమియగు మహిషమండలమున కాతని నంపిరి. అందువలన మా తాతగారు తన యనంతర జీవితమును శ్రీవణ బెలుగోల యందు జైనయతులమధ్య గడపవలసిన వాఁ డయ్యెను.

కార—(ఏకసక్కెముగా) పాపము! అటులనా! రాజా ! అందుచేత చంద్రగుప్తున కపకీర్తి కలుగలేదు గద? సామ్రాజ్యభోగముల తృణప్రాయముగ పరిత్యజించి తానమ్మినరీతి నీశ్వరు నారాధించి నీతాత జన్మసార్థక మొనర్చుకొనెనను.

ఐహికసంపత్తు లస్థిరములు, ఆముష్మిక చింత లేని నరుఁడు ద్విపాద పశువు.

అశో—(ఇంచుకతడ వాలోచించి) మాతండ్రియగు బిందు సారుని కూడ బ్రాహ్మణులు కీలుబొమ్మగ నొనర్చి యుండిరి. మాయన్న సుమనుఁడు బాల్యమున, నజ్ఞానముచే ప్రధానుఁడగు ఖల్లాటకునిపై తనహస్తరక్ష విసరినందు కాతఁడలిగి, రాజెంత ప్రయత్నించినను, రాజ్యము జ్యేష్ఠసుతుఁడగు సుమనునకు, జెందకుండఁజేసెను.

కార—అందుచే—'కొయ్యతీసి కొఱవిఁ జొనిపినట్లు' నీవు వారికి ప్రాప్తించితివి.

అశో—(స్వగ) అదియు ననర్థదాయకమే యయ్యెనా! (ప్రకాశముగ) కావున బ్రాహ్మణ ప్రభావము సామ్రాజ్యమున నించుకంత దిగుమొగంబైనఁ గాని రాజునకు స్వతంత్రత చేకూరదని తలంచి, నేను రాజ్యమందలి ముఖ్యోద్యోగంబుల బ్రాహ్మణేతరుల నెలకొల్ప మొదలిడితిని.

కార—హోమకుండ నుందుండి ప్రజ్వలింప వలసిన యగ్ని హోత్రమును మూలఁబడవైచి, కానరాకుండ మసిపాతల నద్దాని గప్పఁజూచు చుంటివా? రాజా! జాగ్రత్త! రవిలి, రవిలి యయ్యది నిన్నును, నీ సామ్రాజ్యమునుగూడ భస్మీభూతము నొనర్పఁగలదు.

ఆహార యోగ్యమగు ఆజ్యము నాసించునని యగ్ని హోత్రునిపై నలుకయా? ఆ యాజ్యమును భక్షించి కండ క్రొవ్వెక్కి మిన్నుమన్ను గానక నీవు వ్యవహరింపఁ దలంచు చుంటివా?

అశో—(ఆగ్రహించి - నిరసనముతో) ఎట్లు అధికారి [illegible]
స్వతంత్రులై యన్ని జాతుల నతిపరసపముగా [illegible]పొందిన
బ్రాహ్మణులకును, అట్టి పాపనమును నశింపజేయు క్రమమునకు
వేఱి సామ్యము ?

కార—పవిత్రులు. దక్షోకప్రధానులగు రాజులకు సర్వ
స్వాతంత్ర్యత చేకూరుట సామ్రాజ్యమునకుమంగళమందువా!

అశో—(మాటాడక ఊరకుండును)

కార—ఊరకుంటివేల ? నీ నడవడిని నీవు పరీక్షించుకొని
ప్రత్యుత్తర మిమ్ము. విషయలోలుండవగు నిన్ను సుమనుని
కన్న మిన్నగా నెంచిన ఖల్లాటకాదుల కెట్టి శిక్ష ప్రాప్తించి
నను విచారింప నవసరము లేదు.

అశో—(మాటాడక ఊరకుండును)

కార—నగరమున కొక నారిని వివాహమాడిన చపల చిత్తు
నకు సామ్రాజ్యమున నిరంకుశాధికారమా ? ఆహా!
ప్రజల దుస్థితి కేమనవలెను !

అశో—(ఆలోచన నభినయించును)

కార—రాజా! నీ దుష్కార్యములు నీవు సమర్థించు కొనుటకు
యత్నించుచున్నంతకాలము, నీకు సన్మార్గము గోచరింపదు.

అశో—(తనలో) ఈమె మనోధైర్యమున కేమనవలెను ?
(ఆలోచించి — తల పంకించి) స్త్రీల నిందలు వివాహ
మాడక గల్గినని. ఈ యువతిని విడిచి పుత్తునా ? మూర్ఖమతి
మూర్ఛి చూచెదను.

(ప్రకాశముగా) దేవీ! చండాశోకుని యెదుట నింత
నిర్భీతిగ మాటాడు చుంటివి. నీకు ప్రాణములపైనాశలేదా?

కార—చండాశోకుఁడు కాదు, ప్రచండాశోకుఁడు వచ్చి నా ఎదుట నిలుచుండినను, ఆత్మ సాక్షిగ నేను సత్యమని నమ్మిన దాని నిటులనే నిర్భయముగఁబలుకుదును. మూర్ఖా! ప్రాణతుల్యముగ ప్రేమించిన నానాథుని వధించి, యాతని కళేబరము కడ మూర్ఛితనై యున్న నన్నుగొనివచ్చి, సంసారసుఖము లనుభవింప నెంచితివా? ఇంతదనుక నీవంటి దుర్మార్గునితో మాటాడుటయే మహాపాతకము. నాభౌతిక దేహమును బాధింతువు, కాని పరిశుద్ధమైన నాయంత రాత్మను నీవేమి చేయఁగలవు?

ఆత్మహత్య మహాపాతకమని నాకా బాలభిక్షువు బోధించి యుండుటచే నేనింత దనుక జీవించి యుంటిని. (ధైర్యమూని) రాజా! నీ దండనమునఁ బ్రాణములఁబాయ నెంచితిని. నీ మంత్రి శిఖామణులతో నాలోచించి నాకుఁ దండనము విధింపుము. పొమ్ము. అందువలన ఆత్మహత్య యొనర్పకయే నే నీ భౌతిక దేహము విడువఁగలుగుదును. నీ కోపము నాకు ఉపకారము చేయఁగలదు.

అశో—(ముందునకు వచ్చి తనలో) పూర్వమువలె నా మనం బిప్పుడు దుష్కార్యముల కియ్యకొన కున్నది.

మౌనముమాని మాటాడినది అంతేచాలును. కార్యము కొనసాగు నన్న ఆశకూడకలదు. బాలభిక్షువు—బాల భిక్షువు—నే వినిన ఉపగుప్తుఁడేమై యుండునా ? మంచిది అయ్యదికూడ ప్రయత్నింతును.

(నిష్క్రమించును.)

కార—పొమ్ము. దుర్మార్గుఁడా.

---

# కారవాకి

## ద్వితీయాంకము

తృతీయ రంగము (ప్రక్కనుండి దాసి ప్రవేశించి)

( విష్కంభము )

(స్వగతము) కారవాకి వంటయిల్లు సొచ్చిన కుందేలై నదని సార్వభౌముడనుకొనుచున్నాడు. పాపము ఇందఱ స్త్రీలను పెండ్లియాడినాడుగాని, పడతుల కోపము పాము పగవంటిదని ఈతడెంతదనుక తెలిసికొనలేదు.

బ్రతికి బాగుపడదలచుకొనినవారు మహారాజుగారి ఆగ్రహానుగ్రహముల గుర్తించి మాటాడుదురు, గాని, కాటికి కాళ్లుజాచుకొనియున్న ఈ కారవాకిదేవికి నాతని లక్ష్యమేమి ?

(చేతులు తిప్పి) అనుకొనినట్లగుచుండిన నందఱును ప్రయోజకులే! కాదని కారవాకి కళ్లెఱ్ఱ చేయగానే అయ్యగారు కాలుజేతులాడక అవలకు మెల్లగా నిష్క్రమించినారు. అవసరమున్నచోట ఆగ్రహము పనికి వచ్చునా ?

మా అసంధిమిత్రాదేవికాదు అయ్యగారి ఆటలు సాగనిచ్చుటకు! (మాటి విరచి లోని కరుగును).

# కారువాకి

## ప్రథమాంకము

ప్రథమ రంగము        పాటలీపుత్రమందలి విలాసారామము.

(సాయం సమయమున నిద్దరు యువకులు కూర్చుండియుందురు.)

భారద్వాజుఁడు—మన సార్వభౌముని చర్యలందు మార్పు కలిగి నట్లున్నది. నేఁడు ఖైదీలకు కఠిన శిక్ష విధింపరాదని యాజ్ఞాపించినాఁడు. సామ్రాజ్యమున ధనకాంక్ష లేక మరణ దండనము కూడ విధింపరాదని ప్రకటించినాఁడు.

కణ్వుఁడు—మిత్రమా! నేయి యని త్రాగుదుమా నూనె యని తలపోయుదుమా? ఈనాఁటి చర్యలకు సంతసింతుమా? మనవారందఱు అకారణముగ చెరయందుంచబడినందులకు దుఃఖింతమా? ఈ అశోకుని రాజ్యమందు బ్రాహ్మణుఁడై జన్మించుట నేఁ డనర్థదాయకముగ నున్నది. 'పులి మీఁదఁ బుట్ర' యన్నట్లు రాజుగారు మరెవరో గుప్తుని చెప్పించుటకు యత్నించుచున్నారని విన్నాను.

భార—ఔను. రాధాగుప్తుఁడు బ్రాహ్మణుల బాధించుటకుఁ దేఁబడెను. ఉపగుప్తుఁడు కారవాకిదేవిని బోధించుటకుఁ దేఁబడు చున్నాఁడు.

కణ్వ—నానాఁటికి వణిగ్జాతుల ప్రథ మన మగధసామ్రాజ్యమం దధిక మగుచున్నది. కోమటి మంత్రిత్వమే మనకొంపతీయు చున్నది.

భార—అట్లనకుము. కోటి వరహాలిచ్చి కోమటిని కాను

మన్నాఁడు. అల్పవ్యయముతో నధికలాభమును పొందు నుపాయములు వారికి తెలిసినట్లు మనకు తెలియవు. కోమటి యైనను, గొల్లఁడైనను ఆర్యావర్త పుణ్యభూమిని అరాచకమునుండి యుద్ధరించిన వాఁడే మనకు మహాత్ముఁడు, అవతారపురుషుఁడు.

> గీ॥ కోమ్రైన నేమి, గొల్లఁడయిన నేమి,
> భూమి నుద్ధరించు వాఁడె యతఁడె
> యగు మహాత్ముఁ డతఁడె యవతారపురుషుండు;
> అతఁడె బూజనీయుఁ డగును మనకు"

కణ్వ—బ్రాహ్మణుఁడై పుట్టకుండిన వానికి సర్వసమత్వ మెట్లు చేకూరును. అతఁడు లోకోపకారి ఎట్లు కాఁగలఁడు.

భార—బ్రహ్మజ్ఞాన జుగుప్స గలవారమగుటచే మనము బ్రాహ్మణులమైతిమి. అట్టి జుగుప్స గలవారందఱు బ్రాహ్మణులేల కాఁగూడదు. బ్రాహ్మణులులేని యితర దేశములలో లోకోపకారులు లేరందువా? మనము ఐహిక సంపత్తుల కాసింపక ఆముష్మికచింత కలిగియున్నంత కాలము అన్ని తావులఁ బూజింపఁ బడుదుము.

కణ్వ—ఔనుగాని — మిత్రమా! ఈ కారవాకి ఎవరు? కోటలో ఆమె రోజున కొక నాటకమాడుచున్నదఁట. ఈ మధ్య నొకనాఁడు ఆమె రాజును నిలువఁబెట్టి నిలివెడు మాటలన్నదఁట. ఇట్టి గయ్యాళిగంపలు మనయూర లేరనియా, రాధాగుప్తుఁడు రాజుగారిని కళింగమునకుఁ గొంపోయెను ?

(కాషాయ వస్త్రములు ధరించిన మరియొక యువకుఁడు వచ్చి అచ్చో నిలిచి యుండును).

కణ్వ—స్వామీ! మీరెటనుండి వచ్చితిరి? ఇచ్చట మీ కార్యమేమి ?

భిక్షువు—అయ్యా! పూర్వ మందఱ మొక్క-చోటనేయుంటిమి. ఇప్పుడు మీరు రివ్వోచనున్నారు. నేను వేరుగ నిలువఁ బడవలసి వచ్చినది.

కణ్వ—వేషము చూచిన వేదాంతిలాగున్నాఁడు. కాని మాటలలో మనల మ్రింగి వేయునట్లున్నాడు. ఇంకనుకదలింతము. (భిక్షువు నుద్దేశించి) ఇచ్చోటు మీరైన అచ్చోట నిలువఁబడు టెందుకు? దయచేయుఁడు (అని లేచి తాఁ గూర్చుండిన స్థల మాతని కిచ్చును)

భిక్షు—మాబోటి బిక్షువు లొక్క-చో గూర్చుండ నగునా? కుడిచి కూర్చుండుటకు యోగము లేకుండుటను నేను భిక్షుకత్వము పూనవలసి వచ్చినది.

భార—(నిదానించి, వీని కంఠరవము మున్ను బాగుగ విని నట్లున్నది.) అయ్యా! మీ నామమెయ్యది? పూర్వాశ్రమమున మీకుల మెయ్యది ?

భిక్షు—విడిచి పెట్టిన విషయముల నేల జ్ఞాపక మొనర్చి నా మనస్సునకు ఖేదము కలిగింతురు. పేరులలో నేమున్నది. సంఘనియమ మూనిన మాకు నామముతో ప్రశక్తిలేదు. బౌద్ధదీక్ష పూనుటకు పూర్వము నేను వ్యాకుల ముందుంటిని.

భార—(ఆలోచించి) కౌశికా, నిన్ను గుర్తింప లేనందునకు నన్ను క్షమింపుము. నీ జాడ తెలియక షే మెంతయో చింతించుచున్నాము. (లేచి కౌగలించు కొనును)

కౌశికుడు (భిక్షువు)—మిత్రమా! నేటి ఉదయమునుండి ఈ నగరమెల్ల నీ కొఱకు గాలించుచుంటిని. (కన్నుల నీరు పెట్టుకొని) నా పేరు బిగ్గరగనుచ్చరించిన మరల ప్రమాదము సంభవించు నేమో ?

భర—ఇప్పుడు మహారాజుగారి మార్గము మారినది. బ్రహ్మ మించుకంత శాంతించినట్లున్నది—మహామంత్రి ద్వీప కుమారునకు మాయముని వేషమూన వలసివచ్చినది. హా విధాత! ఏమనవలెను. మిత్రమా! ఈ ఏడుసంవత్సరములనుండి నీ వెట నుంటివి ?

కౌశి—కాలు జారిన వారికి కళింగమేగతి. సర్వమత సంరక్షకమగు నా కళింగసీమకేగి సమపాపుర సమీప మందున్న తిస్సమహాముని యాశ్రమమున తలఁదాచుకొని యుంటిని. విదేశీయులెక్కుడుగ వచ్చుటచే నచ్చట క్రొత్తయూగొకటి బయలుదేరినది. కళింగులు విదేశీయుల నందఱిని మొగలు లందురు. అందుచే మా యాశ్రమము మొగలి కొత్తూరని పిలువఁబడుచున్నది. మా గురుదేవునిగూడ కాళింగులు 'మొగలి తిస్సఁ' డందురు.

ఆ మహాముని యనుగ్రహమున నేను బౌద్ధ దీక్షపూని బిక్షువు నైతిని.

గీ॥ బ్రాహ్మణులపైని ద్వేషంబు బ్రబలు నపుడు
భైక్ష్య వృత్తిని గొనకున్న బ్రదుకు టెట్లు ?
దేశకాలంబు లెఱిఁగి వర్తించు చుంటి,
బౌద్ధ దీక్షను గైకొంటి, బ్రదుకుచుంటి.

అశోకుని దండయాత్రవలన లక్షలకొలఁది ప్రజలు నాశన మొందుటయేగాక, కళింగమందలి బౌద్ధాశ్రమము

లెన్నియో యదృశ్యము లైనవి. వేలకొలఁది భిక్షువులు ఉప గు...ని రాజమార్గమున నేఁడు మగధయందు ప్రవేశించినారు. వా... అశోకుని దుర్నయముల నరికట్ట నేతెంచిరి.

భర—ఏమీ! ఉపగుప్తుడే యిటకు విచ్చేసినాడా. ఆతని కొఱకు మహారాజాతుర పడుచున్నాఁడు. కళింగము నుండి కైకొని వచ్చిన కారివాకి దేవిని ఉపగుప్తుఁడు బోధించి, తనకు భార్యఁగా జేయునేమో యని అశోకుఁడాశి పడుచున్నాఁడు.

కౌశి— ఉపగుప్తుఁడు కారవాకిని బోధించుటకు పూర్వము, అశోకుని యందపారమైన మార్పు కలుగవలసియున్నది. కావున, ప్రప్రథమమున ఉపగుప్తుఁడు అశోకుని బోధించి యాతఁడొనర్చుచున్న రాక్షసకృత్యముల మాన్పింప వలెను. అపుడు కదా అశోకుఁడు కారవాకిని వివాహ మాడుటకు అర్హత కలిగి యుండును.

కణ్వ—మిత్రమా! ఈ దేవిని కారివాకి యనుటకు కారణమేమి?

కౌశి—కళింగయువరాజ్ఞిగ నుండిన ఈమె కళింగతీరవాసి యగు నొక మీలనాయకుని కుమార్తె. అచ్చో వీరిని 'కరవాకు' లందురు. కావున ఈమెను 'కారవాకి' యని యందురు.

కణ్వ—ఈమె వృత్తాంతము మనరాజున కెవ్వరు చెప్పి యుందురు.

కౌశి—ఇయ్యది రాధాగుప్తుని పన్నాగమై యుండును. అశో కుఁడు కారవాకిని రాణివాసమున బంధీకృతగనొనర్చి, తాను ...బ్యావర్తము నంతయు నిరంకుశముగ నేల యత్నించు ...పున్నాఁడు.

కణ్వ—బాగున్నది.

గీ॥ తండ్రి క్షత్రియుండు, తల్లి బ్రాహ్మణకాంత
ప్రథమభార్య చూడ వైశ్యకన్య
కట్టుకొనఁ దలంచె కరవాకదానిని
ఇంక బూత్రియయ్యె సంకరంబు॥

భార—కౌశికా! వేళ యతిక్రమించినది. రమ్ముపోవుదము. మన కేల మహారాజులగొడవ—గోడలకు చెవులుండును. చాల కాలమైనది. మా యమ్మ నిన్నుచూచి సంతసింపగలదు. (కౌశికునితో నిష్క్రమించును) కణ్వా! రావేమి?

కణ్వ—నా మనం బించుక స్వస్థత చెడియున్నది. కొండొక తడవు చల్లగాలి యనుభవించి సేదదేరినఁగాని నే నిట నుండి కదల జాలదు.

(కౌశికుఁడు, భారద్వాజుఁడు నిష్క్రమింతురు)

కణ్వ—(స్వగతము) కటకట కాలగతి!

బ్రహ్మఋషి దేశమగు నీ భరత వర్షమున వణిగ్జాతులు వ్యవహారకర్తలగుదురా! నీటిదారుల వీడి, నాటుదారుల వీరు విదేశములతో వర్తక మొనర్ప యత్నించుచున్నారు. బిందుసారుఁడు నర్మద నతిక్రమించి దక్షిణాపథమున కాలిడిన నాటినుండి వణిజులార్యావర్తమున నధికముకాఁదొడఁగిరి. అశోకుఁడు విదిశాపురమున శ్రేష్ఠికూతు, దేవిని, వివాహామాడిన నాటినుండి రాజ్యాంగ వ్యవహారములలో కూడ నీ వణిగ్జాతు లెక్కుడు జోక్యము కలిగించు కొనుచున్నారు.

సముద్రాంతర భూములతో వర్తక మొనర్చుటచే కళింగము ఆర్యావర్తమునుండి బహిష్కరింపబడినది. జైన, బౌద్ధ మతముల మూలమున మరల నయ్యది ప్రాముఖ్యతకు రానున్నది కాబోలు ?

బ్రాహ్మద్వేషము జనించెను కాన మౌర్య సామ్రాజ్యమునకు బ్రాహ్మణుల వలన నే విఘాతము ప్రాప్తింపఁగలదు. తన్నవమానించిన నందవంశమును నిర్మూలించి చాణక్యుఁడు మగధసింహాసనమున మౌర్యుల ప్రతిష్ఠించెను. ఆర్యావర్తమున సుక్షత్రియ వంశము లంతరించినవి. ఇట్టి సంకరు లధికారమున కేతెంచుటచేత నే ఆ శాక్యముని సంకరమతమునకు మరల ప్రాముఖ్యత వచ్చుచున్నది. మౌర్యుల పదభ్రష్టులఁ జేసి బ్రాహ్మణులే సింహాసన మధిష్ఠించిన గాని ఆర్య ధర్మముల సంరక్షించుట కష్టసాధ్యమగును.

(ఆలోచించి) మా కౌశికుఁ డవలంబించిన మార్గమన్ని విధముల యుక్తముగ నున్నది. భిక్షుక వేషమూని బౌద్ధ సంఘమందుదూరి, అందార్య సంప్రదాయముల ప్రవేశింపఁ జేసి, అంతఃకలహముల కల్పించిన గాని, ప్రజాసమూహమునకు బౌద్ధ ధర్మములపట్ల విముఖత జనింప నేరదు. కాకున్న ఈ నిర్వీర్యమైన బుద్ధదేవుని ప్రబోధనములా యార్యావర్తమును కబళింప నరుదెంచుచున్న యవన వాహినుల నరికట్టునది ?

ఈ చండాశోకుని పాలనమున బౌద్ధమతమే తప్పనిసరియైనప్పుడు మే మందరమందుఁ జేరి, బుద్ధదేవు నవతారపురుషు నొనర్చి, బ్రాహ్మణుల యందున్న కర్మకాండ

మంతయు ఆ మతమున ప్రవేశపెట్టకుందుమా! చణక మునిపుత్రుఁడు బౌద్ధమతమును కొంతకాలమే మూలఁబట్టించెను. కాని ఈకణ్వవంశజుఁ డట్లూరకుండఁడు. బుద్ధదేవుని బోధనముల తారుమారు కావించి, ఆమతమందు శాఖోపశాఖ లుద్భవింపఁ జేయకుందునా? లేకున్న వేదమతమునకు వైధవ్యము ప్రాప్తించును.

(ఆలోచించి - తలయూపి)

తాత్కాలికముగ నాబ్రాహ్మణత్వము కోల్పోయిన కోల్పోదును. జగమెరిగిన బ్రాహ్మణునకు జన్నిదమేల! (అని జన్నిదమును పట్టుకొని త్రెంపివేయును) (తల పంకించి విశ్వవిఖ్యాతి నార్జించిన మా వైదిక మతమునకు విఘాతము కలుగ నిత్తునా ? మౌర్యుల మననిత్తునా ?

సీ॥ బ్రాహ్మణ ద్వేషులై ప్రబలు రాజుల నెల్ల
సంహరింపఁడె తొల్లి జామదగ్ని !
బ్రాహ్మణ ద్వేషియై ప్రబలు విశ్వామిత్రు
గెలుపఁడే యల్ల వశిష్ఠమౌని !
బ్రాహ్మణ ద్వేషియై ప్రబలిన నహుషు రా
జ్యభ్రష్టుఁ జేయరే సకలమునులు !
బ్రాహ్మణ ద్వేషులై ప్రబలు నందులనెల్ల
నణచి వేయఁడె కోరి చణక సుతుఁడు!
బ్రాహ్మణ ద్వేషమును బొంది ప్రబల దలఁచు
రాజు సుఖముగ భూప్రజారంజనంబు
చేయఁగా లేడు, ధర్మ సంసిద్ధి గలుగు
బ్రాహ్మణ స్నేహమునఁ గాదె, రాజులకును॥

(నిష్క్రమించును.)

# కారవాకి

## తృతీయాంకము

ద్వితీయరంగము     పాటలీ పుత్రమున కోటయందు దొడ్డగది.

(అశోకుడు కూర్చుండి యుండును)

అశో—కారవాకి మాటల యందు సత్యము లేకపోలేదు. సంసార సుఖము లనుభవింప గోరివచ్చితిఁ గాని, యీామె మూాలమున నాకు స్వర్గసుఖములు రానైయున్నవి.

పరిచారిక—(ప్రవేశించి) జయము, జయము మహారాజా! నిన్న సాయంకాలము మీారంతిపురమున కంపిన, కళింగ పరిచారికనుగాంచినప్పటినుండియు కారవాకి దేవిముఖమందు నూతన వికాసముద్భవించినది. ఆమె యేమి బోధించినదో గాని మన దేవి నిరాహార నియమమును వదలి నిన్నరాత్రి భుజించినది.

అశో—(లేచి - సంతోషముతో-మెడనున్న హారము తీసి ఆమె కొసఁగుచు) చేటీ! ఇయ్యది నీకు పారితోషికముగ నియ్యబడినది. దేవికడ కనిపెట్టుకొని ఆమెకు నా యెడ ననురాగ ముద్భవింపఁ జేయుము.

చేటి—(హారము పరీక్షించి ఆనందించుచు, మెడలో వేసికొని సవరించుకొనుచుండును.)

అశో—నా కోర్కె తీర్చితేని, నీకు హారములుకాదు అగ్ర హారము లొసంగెదను.

చేటి—(తనలో) అమ్మయ్యో! అవి వేనితో చేసెదరోకదా! తమ చిత్తము నా భాగ్యము (వంగి నమస్కరించి, నిష్క్ర మించును.)

(దారియందున్న చారుని త్రోసికొని వచ్చుచు—త్రో కుండాలోచించుచు అటు నిటు పచారు చేయుచుండును.)

చారుడు—(ప్రవేశించి - తనలో) ఈ త్రోసుట యెంత విస్సాటముగ నడచు చున్నది! ఈ నాటికి మహారాణిమెత్తో మన సిచ్చి మాటాడి యుండును. చాన్నన మన్నమిన్న చూడగ తూరీగవలె మధ్య నెగురుచున్నది. మహారాజుల ఆగ్రహానుగ్రహములు రేపగళ్లవలె క్షణ క్షణము మారుచుండు నని ఈమె యెరుంగదు.

(ముందుకువచ్చి - రాజుకు నమస్కరించి)

జయము, జయము, మహారాజా !

అశో—ఉపగుప్తుని జాడకేమైన వినవచ్చినవా ?

చారుడు—కళింగమందున్న రాధాగుప్తునికడకు వేగీరావులంపబడిరి. పాటలీపుత్రమందున్న కళింగకోమటులకు ఉపగుప్తుని విషయమై తెలియునేమో యని వారిని పిలిపించి విచారించుచున్నారు మహాప్రభూ ! ఇంక —

( తెరలో కలకలము )

అశో—ఆగుము. ఆ కలకలమునకు కారణమేమి ?

(ప్రక్కనున్న కవాటము కడకేగి చూచుట నభినయించును.) చారుడా! ఆ యువకుడెవడు? ఏమి వాని సౌందర్యము! వానివెంట జనులు ఇంత ప్రాంకులు చూచుచుస నెటకేగు చున్నారు ? తెలిసికొని రమ్ము.

చారుడు—(వంగి నమస్కరించి, నిష్క్రమించును.)

అశో—(ఆశ్చర్య మభినయించి) ఈతని నడకతీరు చూడ, అప్పు వయస్కుడయ్యెను, ఈ ఆజానుబాహుడు. సామ్రాజ్యముల నేల నవతరించినట్లు కాన్పించుచున్నాడు. కాదు--(తలత్రిప్పి) కాదు—సామ్రాజ్యములన నేల మానవ కోటినంతయు తన చేత యుండలి కీలుబొమ్మ యట్లాడింప శక్తి కలవానియట్లు కాన్పించుచున్నాడు.

(మరల ప్రక్కనున్న కవాటము కడకేగి చూచుట నభినయించి—ఆశ్చర్యముతో) హా, అదేమి! చారుడు ఆబాల, భిక్షువుని నగరిలోనికి కొనివచ్చు చున్నాడు. (చీకాకుతో) ఈ బాలభిక్షువుని గాంచినంతనే నా హృదయమున నొక విధమగు భయముద్భవించు చున్నది. సత్వరమేగి ఆ మహాపురుషుని సభామంటపమునం గలసి కొందును. (త్వరితముగ లేచి)—తన రత్నాభరణములను తీసివైచి - దుకూలముల విసర్జించి తెల్లని నూలు వస్త్రము నొకదానిని పైన కప్పుకొని నిష్క్రమించును)

సేవకుడు—(ప్రవేశించి — అశోకుడు విసర్జించిన దుస్తుల మడత వెట్టుచు, పాడును)

అయ్యానాడు లేదునీకు — అమ్మనాడు లేదు నీకు
బయ్య మెందుకయ్యా — అశోకయ్యా ఈ
యిసిరీతి మేటయ్యా — అశోకయ్యా — నీకు
బయ్య మెందు కయ్యా — అశోకయ్యా.

(పాడుచు పోవును.)

# కౌరవాకి

తృతీయాంకము — తృతీయరంగము

(కోటయందలి సభామండపము మధ్య ఉన్నతస్థానమందు సింహాసన ముండును. అశోకుఁడు ప్రక్కనున్న కుర్చీపై కూర్చుండి ఆలోచించు చుండును)

అశో—సేవకా! చారునితోఁ చెప్పి, ఆబాల భిక్షువు నిటకుఁ దోడ్కొని రమ్ము (శే॥, నిలిచి చూచుట నభినయించి) ఆయుపకుని నడకయందు వినయగాంభీర్యము లెట్లు మిళిత మై యున్నవి! (ఆశ్చర్య మభినయించి) అడుగడుగునకును ఆత్మ విశ్వాసము, సౌశీల్యము సర్వదిశల నెట్లు వ్యాపింపఁ జేయుచున్నాఁడు !

(అట్టె నిదానించి - ఆలోచన నభినయించి - నిశ్చేష్టితుడై నిలచి) చూడఁ జూడ మృతినొందిన మాయన్న - సుమనుని రూపరేఖావిలాసములు - సౌశీల్యాది సుగుణములు - ఈతనియందు కాన్పించుచున్నవి - కారణంబేమి ?

(చారుడు దారిచూపును, న్యగ్రోధుఁడు ప్రవేశించును)

అశో—(మతిచెడి - న్యగ్రోధుని వైపు అట్టె చూచుచు కొంత దనుక నిలిచి యుండును)

చారు—అశోకుని చెంత చేరి నమస్కరించును)

అశో—(స్మృతి నభినయించి - న్యగ్రోధు నుద్దేశించి )

అశో—(అతి వినయముతో - ప్రకాశముగా)

కుమారా! నీ రాకచే నా మందిరము పవిత్రమయ్యెను. కొండొక తడవు ఇచ్చో విశ్రమించి నన్ను ధన్యుని గావింపుము.

(భయ మభినయించి - డగ్గుత్తికతో)

అశోక్య! ఇందరి - సర్వస్వము నీయది - నీయిచ్ఛ వచ్చినచోట కూర్చుండవచ్చును.

(చేతితో అనేక ఆసనముల చూపును.)

న్యగ్రో—(నాల్గు మూలలు పరిశోధించి, సభామంటపమున ఉన్నతస్థానమందున్న రత్నఖచిత సింహాసనముకడ కేగును)

అశో—(త్వరగ నటకేగి న్యగ్రోధు నుద్దేశము గ్రహించి చేయూతనిచ్చి ఆతనిని సింహాసనారూఢునిఁజేయును).

(ముందునకువచ్చి - తనలో)

మణిఖచితమైన మగధ సింహాసన మారోహించుట కవతరించిన మహాపురుషుఁ డితఁడు. ఇట్టివారికిఁ గాక నాబోటి నరరూప పశువులకా సామ్రాజ్యాధిపత్యము ?

(న్యగ్రోధునివంక తిరిగి వినయముతో)

స్వామీ! ఈ సేవకుఁ డొసంగు అల్పాహారముల భుజించి ఈ దీనుని కృతార్థు నొనర్పుఁడు.

న్యగ్రో—రాజా! నీ పంక్తిని కూర్చుండి కుడుచుటకు పూర్వము, నిన్ను కొన్ని ప్రశ్నలడుగవలసి యున్నది.

అశో—(దిగులొంది, వెలవెలఁబారును — శిరస్సు వంచి చేతులు జోడించి నిలువఁబడి యుండును.)

న్యగ్రో—(అశోకుని అవస్థ బాగుగ పరికించి),

మౌన మంగీకార సూచకమా! రాజా! (ఆలోచించి) అజ్ఞానముచే నీ వొనర్చిన యకృత్యముల విమర్శించుట యనవసరము.

అశో—(నిట్టూర్పు విడుచును.)

న్యగ్రో—నేటినుండియు నీవు ధర్మమార్గానువర్తివై వ్యవహా రింతునని బాస యిచ్చినచో నేను నీ కోర్కె దీర్తును.

అశో—(స్వగతము) పాపపరితప్తమైయున్న నా హృదయము నకు, ఈ దయామయుని వాక్యములు, అమృతతుల్యములై శాంతి చేకూర్చినవి. (ప్రకాశముగా) మహాత్మా, సర్వ ధర్మము లెఱింగిన మీరే నాకు సద్ధర్మప్రబోధ మొనర్చి సంపూర్ణునిగఁ జేయ వేడుచున్నాను.

న్యగ్రో—అయ్యా, ఎవరిముక్తి వారిచేతులయందే యు న్నది. మనచేయుండిన మార్గముల కేమి కొదువ? పట్టుదల కలిగియుండిన నెట్టిపనియైనను సులభమగును. ధర్మదీక్ష యే ము కి నోసఁగును. చపలచిత్తునకు అధోగతిగాక యన్యము ప్రాప్తింపనేరదు.

అశో—ఆర్యా, చిత్తస్థిరత చేకూరు టెట్లు?

న్యగ్రో—అయ్యా, 'ఇంటఁ గెలిచి రచ్చ గెలువుము' అను సనాతన వాక్యము నాలకింప లేదా? తన్నుదా జయించిన వ్యక్తి ఇతరుల నిట్టె స్వాధీన మొనర్చుకొనఁగలఁడు.

(అశోకునివంక జూచి)

మనకు నిత్యకృత్యములయం దుపచరించుటకు నిర్మింపఁ బడిన పంచేంద్రియముల స్వాధీనమం దుంచుకొనలేని మనము, పరులను స్వాధీనపఱచుకొనుటకు యత్నించుట వట్టి వెఱ్ఱితనము కాదా? నీ శరీరముపై నీకులేని స్వాతం త్ర్యము, అన్యుల శరీరముపై నీ వాశించుట హాస్యాస్ప దము కాదా? రాజా, ఏమందువు?

అశో—ఇంద్రియముల వశపరచుకొనినంత ముక్తి ప్రాప్తింప గలదా ?

న్యగ్రో—పరుల హింసించి వారి సంపత్తు లపహరించు టెందుకు ? తన్మూలమున నీ యింద్రియముల కానందము చేకూర్చుటకే కదా! ఐన, నీకు దాసులుగ నుండవలసిన ఇంద్రియములకు నీవు దాసుఁడవై వాని యాజ్ఞితము లీడేర్పఁ జెప్పరాని పాపకృత్యము లాచరింతువు. (అశోకుని బాగుగా పరికించి) శరీరపోషణమునకు పనికిరాని వస్తువుల పరిత్యజించుటకై నీ జిహ్వకు రుచుల గ్రహించుశక్తి ప్రసాదింపఁ బడినది. రాజా, వినుచుంటివా ?

అశో—చిత్తము.

న్యగ్రో—అట్టి జిహ్వను పరితృప్తిపఱుపనెంచి, నాగరికత పేర నవరుచుఁ గల్పించి, ఎన్నియో జీవరాసుల హింసించి నిత్యము నీవు ముప్పతిప్పలం బడుచుంటివి. రాజా, ఏమందువు ?

అశో—చిత్తము. ప్రాణతుల్యముగ పెంచుచుండిన సుకుమారములను, హరిణములను, ఆహారార్థమై హింసించుచున్నాము,

న్యగ్రో—(తల పంకించి) రాజా, ఇంద్రియలోలత కాకున్న ఈ మృదంగాది వాద్యములేల, నటవిట గాయకబృందము లేల, కాంతాజనంబుల వీక్షించుటకా మనకు కన్నులీయఁ బడినవి ? సృష్టి వైచిత్ర్యములఁ జూచి యానందింపలేని శుంఠలు కాముకదృష్టితోఁ గాంతల వీక్షించి యానందింప నెంతురు.

సంసార లంపటత సృష్టి కొనసాగించుటకు సాధనమగు నెంచవలె నేగాని, అయ్యది మనజన్మకు పరమావధిగ నెంచి నచో ఆత్మకు అభివృద్ధి కలుగనేరదు. సంసారమభివృద్ధి కావించుటకన్న స్త్రీపురుషులొనర్పవలసిన మహత్తర కార్యము లనేకములున్నవి. ఈశ్వరుని ప్రత్యేకవిలాసమగు యనంతకోటి జీవరాసుల సౌఖ్యమునకు తోడ్పడుటకన్న మనకు మహత్తర కార్య మేమున్నది !

అశో—ఆర్యా, గౌతముండు మనకు మార్గదర్శకుం డెట్లయ్యెను?

న్యగ్రో—గౌతముండు రాజ్యభోగములు పరిత్యజించి, సంసారబంధముల ద్రెంపి, సన్యాసియై మానవకోటికి మంగళము చేకూర్చుటకై పడరాని యిడుమలంబడి, అనేకమార్గముల యత్నించి, తుదకు సాధువర్తనమున శాశ్వతసౌఖ్యము సంపాదింప నగునని ప్రబోధించెను.

అశో—ఆర్యా, అట్టి శాశ్వతసౌఖ్యము నాకుం బ్రాప్తించు టెట్లు ?

న్యగ్రో—బుద్ధదేవునియందు విశ్వాసముంచి, ఆతఁడు బోధించిన ధర్మముల పాటించి, ఆ ధర్మముల నవలంబించి, సాంఘికుల సన్మానించిన నీవు నీ జన్మసార్థక మొనర్చు కొందువు.

మహాత్ముఁడు - ఉపగుప్తుడు నేడు కళింగమునుండి సర్వశిష్య సమేతముగ పాటలీపుత్రమున కరుదెంచి యున్నాడు. ఆతని సేవించిన నీయాశ్రితము లన్నియుం దీరగలవు.

అశో—ధన్యోస్మి, ధన్యోస్మి. (అని మోకాలిపై నిలిచి, నమస్కరించును) (లోపలినుండి)

మహాప్రభో, బ్రాహ్మణోత్తములు విచ్చేసియున్నారు. దేవతార్చనమునకు అన్నియు సిద్ధమైయున్నవి. ధర్మ మహాదేవి అమ్మగారు మీ కొరకు నిరీక్షించి యున్నారు.

అశో—(పరోక్షముగ తనలో) బ్రాహ్మణారాధనము నేటితో సమాప్త మొందు నేమో !

(న్యగ్రోధు నుద్దేశించి) మహాత్మా, మీరు నేఁడు నాటిన బీజములు రేపు మొలకలెత్తఁగలవు. వాని నభివృద్ధిఁజెంది పుష్పింపఁజేయు భారము మీయది. ఈక్షేత్ర లకుఁడు తమ యాజ్ఞల నన్నిటిని శిరసావహింప (చేతులు జోడించి) సంసిద్ధుఁడుగ నున్నాఁడు.

భోజనమునకు వేళయతిక్రమించు చున్నది. వేంచేయుఁడు.

న్యగ్రో—(సింహాసనము దిగి ముందునకు వచ్చి-పరోక్షముగ) బుద్ధదేవుని ధర్మప్రబోధనములు అంతరింపకుండ అజాతశత్రుఁడు తన స్వారాజ్య మందు కాపాడి, ఘనత గాంచెను. అశోకుని మూలమున అయ్యవి నేఁడు అనేక దేశములకు వ్యాపింప నున్నవి.

(ప్రకాశముగ)

రాజా, నీ మనస్సు మారినది, గనుక నీయాతిథ్య మంగీకరించుటకు మాకెట్టి యభ్యంతరమును లేదు.

(అశోకుఁడు దారి జూపును - న్యగ్రోధుఁడు వెంట నరుగును— యవనిక జారును)

---

# కారవాకి

## తృతీయాంకము

చతుర్థరంగము  కోటలోని యొకమూల

( పరిచారిక పరుగున వెడలుచుండును. వెనుక వృద్ధకంచుకి ప్రవేశించి:)

కంచు:—పిల్లా, పిల్లా, పలుకవేమే ? నీగొంతుకొయ్యా.

పరి.—(ఆగి, వెనుక తిరిగి) ఎందుకు తాతా ? నాకు తొందర పనియున్నది.

కంచు—నీకు తొందర లేకపోవడమెప్పుడు ? ఎప్పటి కప్పుడే నీకు తొందర. ఎక్కడికలా పరుగిడుతున్నావు ?

పరి—కారవాకిదేవి యేమిచేస్తున్నాదో మహారాజుగారు చూచి రమ్మన్నారు.

కంచు—ఇంకా మనమహారాజుకు ఈ కారవాకి పిశాచం వదల లేదూ ? బౌద్ధభిక్షువుల బోధనలచే మార్గము మారిందేమో యని అనుకున్నాను.

పరి—(మాటవిరిచి) దానిదారి దానిది—దీనిదారి దీనిది.

కంచు—వారిద్దరకు మధ్య మగ్గంకండెలాగు ఈదారి నీది.

(అని దగ్గరకు వచ్చును)

పరి—నీమాటలు వినడానికి నాకు వేళలేదు. (పో బోవును)

కంచు—అబ్బా - వుండే పిల్లా - ఉపగుప్తయ్య - కోటలో నుంచి వెళ్ళిపోయినాడా—

(అనుచు చెయ్యిపట్టుకొని చెంతకు లాగుకొనును)

పరి—ఉండు తాతా! నాకు ఉక్కిరిబిక్కిరి గావుంది.

(కంచుకిచేయి చిక్కి విదలించుకొని దూరమేగి)

ఎన్నేళ్లు వచ్చినా నీకు మరి బుద్ధిరాదా? పుట్టెను పుట్టిన బుద్ధి పుడకలతో గాని పోదు కాబోలు?

కంచు—అబ్బా నంజా! ఎంతపని సేసావే! (చేయిచూచు కొనుచు) ఎక్కడ నేర్చుకున్నా వీచిక్కులు? (చేతితో కొట్టించి) ఈమాటు నొరికితే నీబుగ్గ కటుక్కున కరిచేనా!

పరి—చూసుకుందాంలేఅప్పటిమాట, శక్తంవొచ్చిందికాబోలు కుంకంపెట్టు తాతా! కుంకం పెట్టు—

(అని పారిపోవును)

కంచు—చిక్కినా, రక్కినా చిన్నదాని కొంగులో కొంత మజావుంది, అందుకే అశోకయ్య కారవాకి కొస వొదల్డు, పాపం అయ్యగారి కవకాశంలేకుండా ఈబోడిదానసల్లెక్కడ నుండి దాపరించారయ్యా?

మహారాజులకు మతాల బాధెందుకో-పెట్టిపుట్టినోళ్ళు, అనుభవించకుండా? ముక్కుమూసుకొని మూలకూకుంటే ఏం పసందు!

(అని నిష్క్రమించును)

---

# కౌరవాకి

తృతీయాంకము. పంచమరంగము

(కోటలోని యుద్యానవనమున కొమ్మలు తెగియున్న అశోక వృక్షము క్రింద తిన్నెపై కారవాకి కూర్చుండియుండును- కళింగపరిచారిక ప్రక్కను నిలువబడి యుండును).

పరి—అమ్మా ! నీవు నన్ను నిశ్చయముగ ప్రేమించుచుండినచో నీయభివృద్ధికోరి నే నొక్కమాట చెప్పెదను. వినగలవా ?

కార—ఏల, ఈ ఉపోద్ఘాతము, ఆమాట ఏదో చెప్పరాదా?

పరి—అశోకుని యక్రమకార్యము లంత మొందింప నీచేతుల యందున్నది. ఏలనందువా ? నడివయసున్న నాతడు నిన్ను మోహించుటచే నీయం దాతనికి యదార్థమైన యనురాగ ముండుట నిజము. ఇట్టి తరుణము వ్యర్థము జేసికొనిన ఎట్టికష్టముల పాలగుదువో చెప్పశక్యము కాదు.

కార—ఏమీ, నన్ను నీవు భయపెట్టుచుంటివా ! పరనారుల పాతివ్రత్యమును బాడొనర్చుటయేపనిగాగల ఆ పాపాత్ముని పరిణయమగు మనుచుంటివా ? చాలు నీప్రలాపము.

పరి—అమ్మా ! నీవు అశోకుని విషయమై అంత క్రూరముగ నాలోచించుట కవకాశము లేదు. ఆతడు నీవనినంతట్టి దుర్మార్గుడే యైన, ఉపగుప్తు సంతటివా డాతని సపర్య లంగీకరించియుండునా ?

కార—(ఆలోచించి) ఏమీ! మన మధురయందుండెడి యుపగుప్తుఁడేనా! ఆ మహాత్ముఁడు కోటలోని కేతెంచుటయు, అశోకుని యాతిథ్య మంగీకరించుటయుకూడ జరిగినదా! చెలీ, ఆమహాత్ముని రాక నాకేలచెప్పవైతివి?

పరి—చెప్పిన లాభమేమి? అన్నియు విడిచిపెట్టి అశోకుని యంతిపురమున మారుమూల మాటుపడియున్న నీకు, ఆతని దర్శన మనవసరమని తలంచియుంటిని. నామాట విని, నీవు మహారాజు మనసు మెప్పించితివా మానవ కోటికి మంగళము చేకూర్చినదానవగుదువు. మహాత్ముఁడు ఉపగుప్తుని యుద్దేశముకూడ నెరవేర్చిన దానవగుదువు. అంతకన్న నీ జన్మకు పరమావధియేమున్నదమ్మా! ఇంతకు నీ వొకరి మాట వినుదానవా?

కార—నీ మాట లసందర్భముగ నున్నవి. అశోకుఁడు నిన్ని పనికా యంతిపురమున కొలువుంచినాడు? నాఆత్మాభివృద్ధికి పనికివచ్చు నెచ్చెలివని నిన్ను నేను నేటిదనుక నమ్మియుంటిని. కాని నీవు నాయధఃపతనమునకు యత్నింతువని గుర్తింప కుంటిని.

పరి—అమ్మా, అనవసరముగ నాగ్రహింపకుము. శాంతి వహించినగాని నామాటలయందలి యాథార్థ్యమును నీవు గుర్తించుటకష్టము. ఈయసందర్భవ్యాఖ్యానములతో నేమి ప్రయోజనము?

కార—ఆఁ, అటులనా! కావలసినంత శాంతి వహించితిని. కళింగయువరాజ్ఞిగ నుండిన నన్ను అశోకుని యుంపుడుకత్తెగఁ జేయ యత్నించుచుంటివి. అంతియేనా!

పరి—ఇట్టి యపోహములతో నీవుండ, నామాటలెల్ల బూడిదఁ బోసిన పన్నీరుకాకుండునా? కోట్లకొలఁద ద్రవ్యము వెచ్చించి ఆర్జించిన నిన్ను అశోకచక్రవర్తి యుంపుడుకత్తెగ నొనర్చునని ఊహించుటకన్న వికృతమే మున్నది!

ఇంతకు, సర్వసంగ పరిత్యాగ మొనర్చుకొని సంఘదీక్ష పూనియున్న నా కేల నీ సంసారపు గొడవ ?

(పెడ మొగము పెట్టును)

కార—(ఆలోచించి) కాదే, అసంధిమిత్రాదేవి యుండ, నేను అగ్రమహిషి నెట్లగుదునని యంటిని.

(పరిచారిక మొగము తనవైపు త్రిప్పుకొనును)

పరి—(తనలో) ఊఁ—అట్లు దారికి రమ్ము.

(ప్రకాశముగా) ఆత్మజులులేని అగ్రమహిషు లెందఱుండిన నేమి ? పోనిమ్ము, నీవు ప్రస్తుతము ద్వితీయమహాదేవివైన చాలదా? పుత్రవతివైనంతనే నీ యగ్రస్థానమున కాటంక ముండదే! పతినివలచి వలపింపఁజేసుకొను సామర్థ్యమున్న వనితకు పదవులతో ప్రసక్తి ఏమున్నదమ్మా! వయసు హెచ్చిన తరువాత వరింపబడినందున నీవు అశోకుని కవ లీల ముక్కుత్రాడు కాగలవు

కార—శేషించిన సూత్రము నీచేతియందుంచుకొందువు కాబోలును! అప్పుడు మా ఇరువురను నీ వాడింపవచ్చును.

పరి—అట్టి యపోహమే నీకున్న అశోకుని కీలుబొమ్మగఁ గావింపుము.

కార—ఆ మాటలకేమిలే—చెలీ, అదేమోగాని కాలధర్మ మొందిన కళింగరాజుపై కెగబ్రాకియుండిన ప్రేమలతికల

నెంత ప్రయత్నించినను మరల్ప లేకున్నాను.
(శిరస్సువంచి దీర్ఘనిశ్వాసముతో కాలిబొటనవ్రేలు నేల రాయుచుండును.)

పరి—(తనలో) వివాహమాడుటకు పూర్వము ఆ కళింగ యువరాజునుకూడ ముప్పు త్రిప్పలు పెట్టిన ముగ్ధ ఈమె.

గీ॥ క్రొ_త్తవస్తులపైఁ గూర్మి కుదురు ననుక
ప్రాతవస్తులపై భ్రాంతి వదులఁబోదు;
పతివియోగంబు లేదు దుర్భరమె కాని,
కాల మనుకూల మొనరింపఁ గలదు నిజము.

(కారవాకి చెంతఁజేరి) పాపము.— ఓను, నూతన వస్తువు లపై మనసు కుదురుదనుక ప్రాతవానిపై భ్రాంతి యట్టులే యుండును. అమ్మా, అట్లుండుట స్వాభావికమే. అందు విశేషమేమియును లేదు. పాపలులేని నీకు పతివియోగము మరింత దుస్సహాముగ నుండును. కాని, కాలమన్నింటి ననుకూల పఱుపగలదు.

కార—అందులకే నేను గతించిన పతితో సహగమన మొనర్చుటకు సంసిద్ధనైతిని.

పరి—అమ్మయ్యో! ఆత్మహత్య కావించుకొనుటయేనా! అట్టి వారికి గతులుండునా? నీ యట్టి దివ్యమంగళ విగ్రహము నిరుపయోగముగ నశించియుండిన, మానవ జాతికి మహా పకృతి ప్రాప్తించి యుండెడిది.

కార—(మెల్లగా) చెలీ, భార్యాభర్తల సంబంధ మెంతవఱ కుండునని నీయభిప్రాయము ?

పరి—మరణముతో సంతరించును. పతి బ్రతికి యున్నంత కాల మాతనియెడ విశ్వాసముగ నుండుటయే మనవిధి. జరయు మృతియులేని ఈ జీవులెందఱి భర్తలను భార్యలను బడసెనో మనము చెప్పగలమా? అందుచే ప్రమాదవశమున నడివయస్సున భర్తను కోల్పోయిన యప్పుడు జీవయాత్ర కొనసాగించుటకు ఇంకొకని వివాహమాడిన తప్పేమున్నది?

వివాహము కేవల సాంఘిక నియమము. సంఘమందతః కలహములు నిరంతర ముద్భవించు చుండుటను భీతిచే భార్యాభర్తల బాంధవ్య మొకటి ఏర్పడినది. అంతియే కాని యిందు ఆధ్యాత్మిక మున్నట్లు కాన్పింపదు. అమ్మా! యియ్యది కేవలము తాత్కాలికము.

కార—చెలీ, నీ వేమనిననుసరేగాని, వైవాహిక సంబంధములు మాత్రము దైవ నిర్మితములని నా యభిప్రాయము. పూర్వజన్మ వాసన లేకుండిన చూచినంతనే కొందఱుసుదతులపై మగవారికి మోహమేల యంకురింపవలెను? వినయదత్తుఁడు నన్ను అల్తాడలో వీక్షించినంతనే మోహపరవశుఁడయ్యెను, అందు కేమందువు?

పరి—ఔను-దాంపత్యములు దైవనిర్మితములను సిద్ధాంతము కూడ కలదు. (ఆలోచించి) వినయదత్తుఁడు నిన్ను గాంచిన తరువాత మోహించెనంటివి. అశోకుఁడు నిన్ను గాంచకుండగనే నీకొఱకు కలవరపడదొడఁగెను. ఇందు కేమందువు?

కార—(చిరునవ్వుతో) నీ మాటల కేమిగాని, అశోకుని వివాహమాడుటచే ఉపగుప్తుని ఉద్దేశము నెఱవేర్చినదాన నగుదు నంటివి. అది యెట్లు?

పరి—మనసంతయు నీమీదనే యుండుటచే, అశోకునకు నేడు మంచి చెడ్డల విచక్షణయే తెలియకున్నది. నిన్ను వివాహ మాడిన నిశ్చల మనస్కుడగును. అప్పుడు గదా బౌద్ధ మతోద్ధరణకు ఉపగుప్తుడొనర్చుచున్న ప్రయత్నములు ఫలించును.

కార—ఆత్మాభివృద్ధికోరి నేను ఆత్మహత్య మానియుండ, నీవు నన్ను పుత్రవతి నగుటకు పురికొల్పుచుంటివి. అందు వలన నాకు బంధము లధికమగును.

పరి—అమ్మా, జన్మించిన ప్రతివ్యక్తికిని ఆత్మాభివృద్ధి ఎంత ముఖ్యవిధియో సంఘాభివృద్ధియు నంతముఖ్యవిధియే యని నిశ్చయముగ నెఱుంగుము. సృష్టి ఈశ్వరవిలాసము కాదా?

కార—ఔను.

పరి—భగవంతుడు స్వయముగవచ్చి అడుగడుగునకును సృష్టి నభివృద్ధి కావింప లేదుగదా? అందుకే జీవకోటి కంతకును ధనదారల యందెక్కుడు అభిరుచి కల్పించినాడు.

కార—ఐన నేమందువు?

పరి—కావున నీశ్వరునియందు విశ్వాసమున్న ప్రతివ్యక్తియు నాతని సంకల్పము కొనసాగించుటకు యత్నింపవలెనని నా యభిప్రాయము.

కార—అనగా, నేను పుత్రవతినగు వరకును భర్తలపై భర్తల కట్టుకొనుచుండ వలసిన దనియేనా నీయభిప్రాయము ?

పరి—ఔనమ్మా; మకుట ధారుల మస్తకములపై తాండవింప వలసిన మాణిక్యము మట్టి పాలగునని విచారించుచున్నాను.

వయస్సున చిన్నదానవు; రూపరేఖావిలాసముల నద్వితీ
యవు; అట్టి నీవు నిర్భాగ్యవైధవ్య మనుభవించుచుంటే
నేరు దుఃఖింపరు !

గీ॥ అక్కట, రాజకిరీటాగ్రహారమైన మణివలె
పుట్టి పాలించదు నాతిగ నిసి నగరు,
రూపురేఖావిలాస నిరూపనమ్ము,
విఫలమై వ్యర్థగతిని జీవింపవలెనె ?

ఇట్టి దివ్యమంగళవిగ్రహము, ప్రతిబింబము పరికించ
మున కర్పింపకుండ నిరుపయోగముగ నీతో నశించును
గదా యని విచారించుచున్నాను.

కర—చెలీ, పురుషుడవై జన్మింపకుండినందుకు, నేడు నీవు
విచారించుచున్నావు కాబోలును!

(అని పరిచారిక చెక్కిలిపై కొట్టును.)

పరి—ప్రాణప్రియా, యథార్థమాడిన ఆగ్రహింపవుకదా ?

కార—అప్పుడే నీకు పుంసత్వ మంకురించినట్లున్నది.

పరి—(కారవాకి చుబుకము నొక్కి, ముద్దాడి ఆమెమోము
నందు దృష్టి నిలిపి) ఈ దివ్యమంగళ విగ్రహమును వదలి
యుండలేకయే నేను కళింగమునుండి కాలినడక నిట
కేతెంచితిని. ఆడుదానిని వలపింప జేసినట్టి నీ యందమున
కెదురున్నదా!

(అని గట్టిగ కౌగలించుకొనును).

చేటి—(ప్రక్కనుండి ప్రవేశించి - ముక్కుపై వ్రేలుంచుకొని)
ఆఁ, ఏమి చుంబనములు! ఏమి ఆలింగనములు! ఈ పరిచా
రిక మహారాజుపాత్రము నభినయించుచున్నది కాబోలు!

(ఆలోచించి-నిదానించి చూచి) కాదు, అందంతరించిన అను రాగలతికలను, చుంబనాది ప్రక్రియలవలన మరల నీమె రాణియందంకురింపఁ జేయుచున్నట్లున్నది.

కారవాకజాతి స్త్రీలు అన్ని పాత్రముల నభినయింపఁ గలరు— కాల విలంబ మొనర్చిన కార్యము మించి వచ్చు నేమో. (మంజునకు వచ్చి)

అమ్మా! ఆజ్ఞయైన నయ్యగారు లోనికి విచ్చేసెద మను చున్నారు.

కార— (మొగము చిట్లించుకొని) మహారాజు మన్ననల నందు కొను స్థితియందు నే నిప్పుడు లేను.

పరి—కావున కొంత తడ వవ్వల వేచియుండవలసినదని మీ మహారాజుగారికి విన్నవింపుము.

చేటి—(నమస్కరించి, నిష్క్రమించును.)

కార— (చిరునవ్వు నవ్వి) చెలీ; నీకీ యధికార మెవరొసంగిరి?

పరి—చిరకాలమైత్రిచే నార్జించిన యధికారమియ్యది. నీవు నా దానవని యిప్పుడేగదా చెప్పితివి. కాదందువా — చెప్పుము - వచ్చినదారిఁబట్టి యిపుడే యింటి కేగుదును. (లేచి పోబోవును)

కార—(పరిచారిక చేయిపట్టుకొని) వలదు, వలదు—ఆగుము నే నే మంటినే? ఇంత మాత్రమునకే యీ యాగ్రహమా? (గడ్డము పట్టుకొని) నేను నీదాననైన నీవు నన్ను అశోకున కేల యంటఁ గట్టుటకు యత్నించుచున్నావు.

పరి—అదియు నీ మేలు కొఱకే. అమ్మా! ఉండవలసినరీతి నుండక యుట్టి వికృతాకారము ధరించియుండుటపాడియా? (ఒడిలోనుండి అద్దము తీసి కారువాకి కందిచ్చును) చూచు కొనుము, నీ ముఖవైఖరి ఎట్లులున్నదో? అయ్యది నీకే భీతి గొలుపుచేమో !

కార—(అద్దము చూచుకొని ముంగురులను సవరించుకొన నారంభించును)

పరి—(పరోక్షముగ) అంత యింతకు వచ్చినది. మనసు మా రినదనుట కింతకన్న ప్రబల నిదర్శనమేమి కావలెను! (మెల్లగ వెనుక కేగి, కారవాకి వెనుక కూర్చుండి, చిక్కు సవరించి, కొప్పు దువ్వ ప్రారంభించును.)

కార—కట్టిన వలువయు కడు మాసినట్లున్నది.

పరి—వలచిన మగనికి వలువతో ప్రసక్తి ఏమున్నదమ్మా !

కార—చెలీ! అశోకునికి నాయందు యథార్థమైన ప్రేమ యున్నదందువా?

(చెట్టుచాటున అశోకుడు పొంచియుండి కాన్పించును )

పరి—అందుకు సందేహమా ! సర్వంసహామండలం బేలు స్వాభౌముడు నీ ప్రియదాసుడగుట కింత యత్నించు చున్నాడో ఈ చెట్టుచేమల పరీక్షించిన దెల్లము కాగలదు.

అశో—(చెట్టు చాటున అడగియుండుటకు యత్నించును)

కార—ఐన నశోకుడు వరింపదగిన వీరుడందువా ?

పరి—అమ్మా! ఆతని అస్త్రకౌశలమే నీవు చవిచూచితివి. ఆతడు అద్వితీయ మహాపురుషుడనికూడ నే ననగలను.

ఆ మహారాజు పుట్టుపూర్వోత్తరంబుల నించుకంత చెప్పెద నాకర్ణింపుము.

పరమపవిత్రమైన బ్రహ్మకులమునజన్మించిన సుభద్రాంగి ఈతనికన్నతల్లి. సద్గుణరాసియైన ఆమెను సామ్రాజ్యమందలి ప్రజలు ధర్మదేవతయని పేరిడియుండిరి. గర్భవతిగనున్న సుభద్రాంగి కలగాంచి కలవరపడుచుండ జినసానుఁడను అజీవకుఁడే తెంచి పరమభాగవతోత్తముఁ డుద్భవించునని సోదె చెప్పి చనెను. ఆ పుత్రుఁడే అశోకుఁడు. అటుతరువాత బిందుసార మహారాజు తన పుత్రులయందు సామ్రాజ్య భారము వహించుటకు తగినవాని నెంచు నుద్దేశముతో పింగళవత్సుఁడను జైనమునిని పిలువనంపెను. ఆతఁడేతెంచి అందఱిని పరీక్షించి అశోకుఁడే వారందఱిలోనుత్కృష్టుఁడని నొక్కి వక్కాణించి చనెను. ఇట్లు జైన,బౌద్ధ, బ్రాహ్మణ మతముల వారంద ఱేకగ్రీవముగ నధికుఁడని నిర్ణయించిన వానిని నీవు నిరసనముగ చూచుచున్నావు.

అశో — (తనలో) ఈ కళింగపరిచారికఋణము నేనెట్లు తీర్చుకొందును ?

కార — చెలీ, అతని ననరాని మాటలాడి మనసు నొప్పించి అంపివేసితిని. (తలవంచి) నేఁ డాతని మొగము చూచుటకే నాకు సిగ్గగుచున్నది.

పరి — అమ్మా! మనసుండిన మార్గముల కేమి కొదువ ? (చెయిసన్న చేసి అశోకుని పిలిచి, ఆతనిచేతికి జడనందిచ్చి, మెల్లగలేచి యవ్వలకు నిష్క్రమించును.)

కార—ఇంత యొనర్చినను ఆ దయామయుఁడు నాయం
డించుకంతైన కినుకవహింపక కంటిలోని పాపయట్లు నన్ను
కాపాడుచున్నాఁడు.

అశో—ఊఁ—(పరిచారిక యందిచ్చిన సగమల్లినజడ నల్లలేక
మొలనున్న పట్టి రుమాలుతీసి యద్దానిని బంధించును.)

కార—విశ్వాసఘాతకినని ఆతఁడు నాపై నాగ్రహించునేమో.
చెలీ! (అద్దమందుకొని చూచుకొనుచు) నీవేగి యాతనిని
లోనికి తెమ్మని (అశోకుని అద్దమందుచూచి—సిగ్గు నభిన
యించి)

చెలీ — చెలీ — ఎటకేగితివే ?

అశో—దేవీ! నీయాజ్ఞల నిర్వర్తింప నీ యీ సేవకుఁడు సం
సిద్ధుఁడై యున్నాఁడు. నీ ముఖబింబమును మరుగుపఱచు
చున్న ఆ ముంగురులు సరిపెట్ట నిమ్ము.

(అని చుబుకము చేఁబూన యత్నించును)

కార—(కనుబొమలు చిట్లించి—ఇంచుకంత దూరమేగి —
సిగ్గునభినయించుచు ముంగురులు తానే మొగఁద్రోసికొని)
ఆఁ, ఇదేమియాగడము! అక్రమములకు మేరయుండవలదా?

అశో— (చేతులు చాచి) ప్రాణప్రియా ! ఆగ్రహమునకు
అంతముండవలదా ?

( అని దగ్గరకేగి - మోకాలిపైఁబడి )

నేను నీ కొనర్చిన యక్రమముల క్షమింపుము.
(కత్తిదూసి) కాదందువా, నే నిటనే నీపాదములకడ
ప్రాణములఁ బాసెదను.

కార—(తనలో) ఏమి ! ఈతని యాగడము

(ఆలోచించి)

గీ॥ అరులఁ గెల్చితి, ధనదార లపహరించి
తాఁరించితి క్షత్రియాగ్ర్యమగు ధర్మ
మే మిదోషంబు గలదిందు నృపవరేణ్య !
నిను క్షమింపు మటంచు నన్న నెద వేల !

రాజా ! క్షత్రియోచితధర్మ మాచరించితివి. శత్రుల నిర్జించి వారి ధనదారల కైకొనివచ్చితివి. అందు నీ తప్పే మున్నది. ఇంతకు నిన్ను క్షమించుటకు నే నెంతదానను ?

( అశోకుడు లేచి నిలువఁబడి కత్తి ఒఱయం దుంచును.)

కార—(తనలో) ఈతని ఆకారవికారములు నేఁడు నన్నేలనో ఆకర్షించుచున్నవి.

(పైకిచూచి, ప్రకాశముగా) మొఱడుగ నున్న ఈ అశో కము నేఁడేలనో వింత మొగ్గలఁ దొడగ ప్రారంభించినది !

అశో—అట్లైనను అబల లలుక వీడకున్నారు. తరుణీ, నీవీ అశోకవృక్షచ్ఛాయ విశ్రమించిన మాత్రమున నయ్యది కోరిక లీరికలెత్తి వింత మొగ్గలఁ దొడగ ప్రారంభించెను. (మోకాలిపై కూర్చుండి చేతులుచాచి కారవాకికాళ్ళు పట్టుకొని) నీ వనుగ్రహించిన —

(కారవాకి కాలు విదలించుకొని దూరమేగి నిలిచియుండును)

ఇంక నీ అశోకము అవలీల పుష్పించి యందరిపై పూలవాన కురిపించును.

(ఆనందముతో నిలువఁబడును)

కార—(ఆలోచించి—తలపంకించి — మందహాసమొనర్చి )
మాటలుకూడ నేడు కడు మార్దవముగ నున్నవి.

అశో—ఆదరణమునుబట్టియే హావభావములు మారుచుండును.
పాదతాడనము లొసఁగ్చి నన్ను పవిత్రుని గావించితివి.
(ముందడుగిడి చేతులుచాప)

ఇం కెంతదనుక ఈ దాగుడుమూతలు ?

కార-(ముందుకేగి) చెలీ, ఇంతసేపు నన్నువిడియుంటపాడియా!
(ఉద్యానవనమందు బోనులోనుండిన సింహాము గర్జించును)

అమ్మయ్యో !

(అనికేకవైచి రెండడుగులు వెనుక కరుదెంచి అశోకుని
కౌగిటఁబడును.— అశోకుఁడామెను అండఁజేర్చుకొని
మొలనున్న కత్తిఁదూసి)

అశో—కరవాలముఁబూని నేను కాచుచుండ కాలుఁడైనను
నిన్ను కన్నెత్తిచూడఁగలడా ! (ముద్దాడి) కాంతా,
భీతిలకుము; ఆ సింగము బోనునందు బంధింపబడియున్నది.

కార—క్రూరమృగములు సహితము మీకోర్కెలీడేర్ప
నన్నుప్రోద్బలించుచున్నవి. రాజా! అబలను, అసహాయను,
నన్నెట్లు పాలింతువో !

అశో—దేవీ, నాసర్వస్వము నీయది. నేటినుండియు నన్నును
నా సామ్రాజ్యమును నీవే నీయిచ్ఛవచ్చినరీతి పాలింతువు
గాక ! (ఇరువురును తిన్నెపై కూర్చుందురు)

(యవనిక జారును)

———

# కారవాకి

## చతుర్థాంకము    విష్కంభము

( కళింగపరిచారిక పద్యము చదువుచు ప్రవేశించును )

చం॥ తనువనుచువ్వఁ జాపులను దారముఁగట్టి బిగించి, సుందరం
బను పెనుముల్లునన్ దరుణియన్ పలలం బెఱ్ఱగుచ్చి, మోహమన్
వననిధిఁ బద్మసంభవుఁడు నైచిన గాలముఁజూచి, పూరుషుం
డనుఝషమ ముబ్బి మ్రింగఁగఁ బ్రయత్నముసేసి, తగుల్కొనున్ వడిన్.

అంతలో నుండును మగవారి బీరములు! మేకపోతు గాంభీర్యమనిన మగవారిసొమ్ము. కావలసినంత అహంభావమే గాని, కార్యముపట్ల ఆడుదాని సహాయములేనిదే వారియాటలు సాగిరావు. నేను రాకుండిన మా కారవాకిదేవి అశోకున కింతలో స్వాధీనురాలై యుండునా! ఐకమత్యముండిన ఆడువారు మగవారిని ఇంతలో సాధింపవచ్చును. జగన్నాటక సూత్రధారులము మేముగాని వారుకారు.

చేటి—(ప్రవేశించి) మన మహారాజెక్కడ ? ఉపగుప్తాది బౌద్ధభిక్షువులు వచ్చి యాతనికొఱకు సభావేదిక కడ వేచియున్నారు.

పరి—మహారాజు యింత వేగిరము సభాస్థానమున కేతెంచునని తోఁచదు. కనిపెట్టుకొనియున్న నాకే మూఁడురోజులనుండి మాదేవి దర్శనము కాలేదు.

చేటి—అటులనా!— వారికేమి చెప్పమనెదవు ?

పరి—అనిర్వాచ్యమైన అంతఃపుర కార్యములయందు మహా రాజు నిమగ్నుఁడై యున్నాఁడని చెప్పుము. తొందరలు తీరినవెంటనే మహారాజు మహాత్ముల దర్శనమున కేతెంచు నని మనవిచేయుము. మూఁడుకాళ్ళ కాల్చిన ముగ్ధవు. నీకు మాటలు నేర్పవలెనా? (బుగ్గపై పొడుచును)

చేటి—రాజ్యముల రగిల్చివచ్చిన రమణివి, నీప్రక్కనే నీ ముందట నేను దిగదూడ్చునకైన పనికివత్తునా!

పరి—ఔనే, నీ అగ్రహారములమాట యేమైనది?

చేటి—అవసరము తీరువఱకే అన్నిమాటలును. అడిగిన చిరాకు, అడుగకున్న పరాకు; మగవారి అవసరాలాపము లకు అంతముండదు. అందులో రాజుల సత్యవాక్య పరి పాలన వేరుగ చెప్పవలెనా?

పరి—అప్పటి అగ్రహారములు, యిప్పుడు అర్ధచంద్రప్రయోగ ముల క్రింద మారునేమో జాగ్రత్త!

చేటి—ఆందోళనములేక అయ్యగారు చల్లగానున్న నాకంతే చాలును. ఆ సిరి సంపత్తులేవో మీరే చూరకొనుడు. (నిష్క్రమించును.)

పరి—మాటలుచెప్పి మాన్యములంటుడి మునుగు. ఈ తొత్తుల కిచ్చిన దానిలో నర్ధాంశము భిక్షువుల కొసంగి మానవ కోటి కెంతయో మంగళము చేకూరగలదు. కారవాకిదేవి మూలమున కార్యము క్రమముగ సాధింపఁబడెను. అక్రమ కార్యములకుదించి, రాజులను దోచుకొనుటకే, ఈ పరి చారగణము కాచుకొని యుండును. అశోకుని అక్రమ కార్యములకెల్ల వీరే కారకులు [నిష్క్రమించును.]

―――

# కారువాకి

చతుర్థాంకము ప్రథమ రంగము

స్థలము—పాటలీపుత్రమునందలి కోటలోని ఉద్యానవనము.
కారువాకిదేవి తిన్నెపై కూర్చుండి యుండును. కళింగపరిచారిక
ప్రక్క నిలిచి యుండును.

పరిచారిక—అమ్మా! మూలఁబడియున్న బౌద్ధమతమునకు నీ మూలమున నేఁడఖిల భారత విఖ్యాతి ప్రాప్తించినది. ఉపగుప్తుని యాదేశమున దేశమందంతటను ఎనుబదివేల స్తూపములు కట్టఁబడినవి. వానియందు బుద్ధదేవుని దైహిక శేషముల (అస్థుల) ప్రతిష్ఠించుటయే యవశేషముగ నున్నది. ఇంకను రామగ్రామమందలి అస్థికలు అశోకునికిఁ జేఁజిక్క లేదట.

కారువాకి—అటులనా? బుద్ధదేవుని అస్థికలకొఱకు మొదటినుండియు ఇట్టి వాదప్రతివాదములే జరుగుచున్నవి.

పరి—అమ్మా, అది ఎటుల ?.

కారు—గౌతముని నిర్యాణానంతరము ఆనాఁడు కుశనగరమునందుండినమల్లవులు ఆతని అస్థికలఁ జేఁజిక్కించుకొనిరి. మగధ నేలు అజాతశత్రుఁడను రాజు మఱికొందఱితోఁ గలసి, ఆయస్థికల గైకొనుటకుమల్లవులపైదాడివెడలెను. అహింసా మతము బోధించిన మహాత్ముని అస్థికలకొఱకు నిష్కారణ రక్తపాతమగునని ఎంచి ద్రోణుఁడను బ్రాహ్మణుఁడు మాధ్యస్థమూని వానిని ఎనిమిది జాతులకు సమముగఁ బంచియిచ్చెను. ఎవరికి వారు స్థూపముల నిర్మించి

యందు వారి భాగమునకువచ్చిన యస్థికలం బ్రతిష్ఠించి పూజించుచుండిరి. బుద్ధదేవుని అస్థికల యందొకభాగము కళింగతీరవాసులైన కోయ* లార్జించి తెచ్చి, రామగ్రామ మందు స్తూపముగట్టి అందుంచిరి.

మధ్య కళింగవాసులకు దంతాపురము ఎంత పవిత్ర స్థలమో, ముఖ కళింగ వాసులకు రామగ్రామమును అంత పవిత్ర తీర్థము—(విచారముతో) ఉత్తరకళింగమందు కూడ నట్టి పవిత్రతీర్థమును స్థాపింపవలెనని యూహించు చుండ ఈ యుద్ధము ప్రాప్తించినది.

పరి—అమ్మా! మనమహారాజు రామగ్రామమునకడ స్తూపమం దలి అస్థికల తేజాలనందుకు కారణమేమి?

కార—ముఖ కళింగ మీనాడు నాగవంశోద్భవులగు రాజుల పాలనంబున నున్నది. అహింసావ్రతమూని యున్న అశో కుండు వారిపై దండువెడలండు. మంచిమాటలతో వారంత కన్న ఆ యమూల్య పదార్థముల వీడరు.

(ఆలోచించి — నిట్టూర్పు నిగిడ్చి) నీవు డిగితివి కావున నా జన్మభూమియందుగల అభిమానము నే నింతవఱకు మాటాడంగలిగితిని. (ఆవులించి) చెలీ! నాకు నిదుర వచ్చుచున్నది. ఇంచుక సేపు మాటాడక నన్ను సేదతీర్చు కొననిమ్ము.

(అచ్చోటున నే తీన్నెపై నొఱిగి, పరిచారికతోడ తనకు దిండు గాగ నిమురించును.)

పరి—ఈ కారవాకి గర్భవతికాకుండిన ఈకెంకూడ సార్వ భౌమునితో తీర్థయాత్రలకుబయలువెడలుట సంభవించెడిది.

---

* (Koliyas)

తన్మూలమున నాకుఁగూడనట్టిభాగ్యము చేకూరియుండును. ఈమె మూలమున నాకుకూడ కాలు సంకెళ్లు లాయెను. తల్లియు పిల్లయు వేరగునంతవఱకు నేనింక ఆరునెల లిట కాలుకట్టుకొని యుండక తప్పదుకదా? ఈమెను వీడలేక యే సార్వభౌముఁడు ప్రయాణము జాగుచేయుచున్నాఁడు. కారవాకి అశోకుని సంపూర్ణముగజయించినది. అశోకుఁడు కళింగమందుకొంతభాగమే జయించెను, గాని మాదేవి అశోక చక్రవర్తిని పూర్తిగా స్వాధీనమొనర్చుకొని యేలుచున్నది.

కార—(నిదురలో నిట్టూర్పు నిగుడ్చును.)

పరి—(కారవాకి మోముచూచి) ఏమి! కనుల నీరేమి? (తుడుచును.)

కార—(నిదురలో) మఱల కళింగముపై దండయాత్రయా! నా యొడలు కంప మెత్తుచున్నది. (లేచి, కూర్చుండి— కనులు తెరువకయే) ఆనాఁటి భీకర దృశ్యములు ఇంకను నా కనులఁ గట్టినట్లున్నవి. (దీన స్వరముతో) మహారాజ్ఞి మాయమాటలకు నేఁ జెవియొగ్గి మోసపోయితిని. నా కంఠమున ప్రాణముండగ మఱల అశోకుని కళింగముకడ కేగనిత్తునా! (గడ గడ వడఁకుచు లేచి నిలుచుండును.)

పరి—(లేచి కారవాకిని పట్టుకొని) అమ్మా! అమ్మా! ఏమి అట్లు పలువరించుచుంటివి. కనులు విప్పిచూడుము.

కార—(కనులు విప్పి—వెఱ్ఱి వెఱ్ఱి చూపులతో)

అశోకుఁడు! - కళింగము !! - దండయాత్ర!!! దాసీ! ఏమి చేయుచుంటివి ? సార్వభౌము నిటకు సత్వరము

శ్రోడ్కొనిరమ్ము - ఆ నరరూపరాక్షసున కింకను రక్త దాహము తీరినట్లు కాన్పింపదు.

పరి—అమ్మా ఆగ్రహింపకుము. ఏమి కలగంటివి? మహారాజు నర్పిన అక్రమ మేమి ?

కార—(కనులెత్తి జేసి) పాదుకలకు పట్టాభిషేక మొనర్పవలసి వచ్చినప్పుడు రాణులు దాసీజనము చెప్పినట్లు చేయుదురు లే!

( లోపల ధ్వని )

'—చెప్ప లేదంటారు. విన లేదంటారు. జాగ్రత్త! రాజుగారి తో పదివేలజనము పయనమగుదురు. కావున మార్గమందు కావలసిన దినుసులనంద జేయువారున్న, మహామంత్రికడకు వచ్చి కనబడుడు. రేపు ఉదయములోపున రాకున్న లాభ ముండదు—'

కార—(తలపంకించి)

గీ॥ హా నరేంద్రచంద్ర యనుకంప లేకిట్టు
లాచరింతు వంచు నరయనైతి

దాసీ - వింటివా! ఇంక పొమ్ము - నా యాజ్ఞ నిర్వ ర్తింపుము. (దాసి నిష్క్రమించును)

ఖడ్గ మెదురు తిరిగి కారణంబడు గంగ,
దుర మొనర్ప యోధవరున కగునె ?

(వెనుక కేగి తిన్నెపైకూర్చుండి) ఎవరక్కడ? (లోనుండి- అమ్మా! ఏమిసెలవు?) పానీయముల కొనితెమ్ము.

(లోపలనుండి—చిత్తము)

కార—(స్వగతము)

పట్టుమన్ని పదినిముషములైనను నిదురించితినో లేదో—

ఎట్టి ఘోరదృశ్యముల గాంచియుంటిని! (నిట్టూర్పు నిగిడ్చి) ఏమి! కల యథార్థమగునా? అశోకుఁడు కళింగముపై మరల దండెత్తిపోవునా? ఉష్ట్రకరణులు మౌర్యులకు దాసులగుట చాలదా? గోకరణులను, సార్థవాహులను కూడ స్వాధీన మొనర్చుకొన అశోకుఁడు యత్నించుఁగాఁబోలు. హా దైవమా! ఇంక కరవాక జాతుల గతిపేమి?

చం॥ కలకల లాడుదేశములఁ గాల్చెడు మౌర్యుల రాజ్యతృష్ణ ని
స్తుల ధనధాన్య సంపదలఁ దూఁగు కళింగము నాక్రమింపఁగా
గలుగును గాక, యత్నమున ఘోరపయోధిపరీత మేదినీ
వలయమునం బ్రసిద్ధమగు వర్తకమున్ బడయంగఁ జాలునే?

'బొగ్గులకై కల్పతరువును బొడిచినట్లు' ఆర్యావర్తమునకు ధనుసు కొట్టుగనున్న మా కళింగతీరమును నాశ్రమ నర్చి యవ్వల అశోకుఁ డేమి యనుభవించును?

(ఆలోచించి) ఆఁ, ఏమి నా వెఱ్ఱి. నాల్గునెలల క్రిందట అశోకుఁడు నాచేతఁ జేయివైచి కళింగమున కెట్టి యపకృతియు గావింపనని బాసయిచ్చెనే! అప్పుడుకదా నే నాతనిఁ బెండ్లాడితిని. ఇంతలో నాతనియందు మార్పేల రావలెను?

కాకున్న ఈ ప్రకటన కేమనవలెను?

పురుషులు చంచలస్వభావులు. అందునను రాజులమాట యన్న నిఁక నడుగవలెనా? (ఆలోచించి — తలపంకించి) తండ్రితాత లార్జించిన సామ్రాజ్యమునకు కళింగతీరము లేకుండుటచే కలిగిన మొట్టి ఈతఁడు తీర్చుకొనఁ జూచుఁగాఁబోలు. మహారాజు వచ్చు వేళయైనది. చూచెదగాక.

(లోపల — అమ్మా! పానీయము సిద్ధపఱచితిని)

( నిష్క్రమించును. )

---

చతుర్థాంకము　　　　　　ద్వితీయరంగము

( అశోకుని రాణివాసము )

అశోకుఁడు (ఆతురమున ప్రవేశించి, అటునిటు పరిశీలించి) చేటీ, దేవియెక్కడ? ఆలస్య మొనరించినందుకు మా దేవి నాపై అలుకఁ బూనినది కాఁబోలు !

చేటి—అమ్మగారిప్పుడే లోనికేగిరి. దయచేయుఁడు (అని ఆసన మమర్చును). ఆజ్ఞయైన అమ్మగారిని తోడ్కొని వత్తును.

అశో—మంచిది. నెమ్మదిగామాత్రము నారాక నెఱింగింపుము.

(చేటి నిష్క్రమించును)

అశో—(ఆలోచించి) ఎంతకాలము నన్నిక్కడ ఈమె నిరీక్షింపఁ జేయునో తెలియకున్నది.

చ॥ తగవులఁ దీర్చుచోట, రణతంత్రములన్ నడపించుచోట, మె
చ్చుగ మగవారి శక్తియును జూపఁగవచ్చు స్వతంత్రశక్తి; విం
తగ గృహరాజ్యపాలన మొనర్చెడు చోటుల నిశ్చయంబుగా
మగువలచేతి కీల్బొమల నాడ్కిఁ జరించెద రెట్టివారలున్.

(నవ్వి) ఇతరులను నా కొఱకు నిరీక్షింపఁజేయు నేను ఇచ్చట నొక అబల యనుగ్రహ మార్జించుటకు కనిపెట్టుకొని యుండవలసి వచ్చినది. అవసరమునుబట్టి అవస్థ మారవలసి వచ్చును—అదిగో! మా దేవి వచ్చుచున్నది. రాజ్యవ్యవహారములచే ఇంతదనుక రాలేనందుకు ఆమె నాపై నాగ్రహించినట్లున్నది.

కార—(ప్రవేశించి—దూరముగ నిలిచి) ప్రభో! సర్వమును సిద్ధమైనదా ? బయలు వెడలుటకు ఇంక నెంత వ్యవధి యున్నది ?

అశో—(ఆశ్చర్య మభినయించి - లేచి కారవాకిని చేరబోవును) దేవీ! ఆగ్రహము చాలించి ఆసీనవు కమ్ము.

కార—సామ్రాట్టుతో సమముగా కూర్చుండునంతటి భాగ్య మా నాది ?

అశో—దేవీ! క్షమింపుము-నీ మాటలు నా కర్థము కాలేదు. నీ యాజ్ఞలేనిది నే నెటకరుగుదును? ఉపగుప్తుడు న న్నెంత వేగిరింపుచున్నను, నిన్నువీడి చనుటకు మనసొప్ప కుండుటచే కదా యింత దనుక జాగొనర్చుచుంటిని.

బుద్ధదేవుడు భౌతికదేహముతో విహరించిన స్థలములం గన్నులారం గాంచినంగాని నాకు మనశ్శాంతి చేకూరదు. అటుతరువాత ఆ మహాత్ముని ధర్మముల నన్నియెడల ప్రకటింపం దలంచితిని.

కార—(తనలో) ఏమి నావెట్టి. ఈతనిపట్ల నిర్హేతుకముగ నెట్టి అపోహము కలిగెను—ఇంచుక లాలించెదం గాక. (ప్రకాశముగ) - మహాప్రభో మీరు కళింగమునకు కలిగించిన యపరాధమునకు ప్రత్యుపకృతిగ ప్రకటనము కావింతు మంటిరే ?

అశో—ఔను, కళింగమందు నేంగాంచిన దుర్నయముల నిరసించుచు, అందుకు మా పశ్చాత్తాపము వెలిబుచ్చుచు నొక శిలపై చెక్కించితిని. కాని అద్దానిని కళింగమందు ప్రతిష్ఠించిన కళింగుల ఆత్మగౌరవమునకు హాని కలిగించినవాడ

నగుదు నను భీతిచే సామ్రాజ్యమున వేరొకస్థలమున కంపితిని.

కార—ఐన కళింగమందున్న వివిధజాతులకు మీ యిప్పటి సదుద్దేశములు వెల్లడియగు టెట్లు ?

అశో—ప్రేయసీ ! అంతతో నూరకుంటి ననుకొంటివా ? కళింగమందు రెండుముఖ్యస్థలములలో రాతిబండలపై నా యభిప్రాయములఁ జెక్కరండని ఆనాఁడే పనివాండ్ర నంపియుంటిని. నేజయించిన కళింగము వైశాల్యమునఁ జిన్నదైనను, అద్దానిని కడుజాగరూకతతో నేలనెంచి మౌర్యవంశసంజాతులగు రాకొమరులనే యటకు పాలకులుగ నంపితిని. దేవీ ! నాసర్వశక్తులచే గళింగుల స్నేహ మార్జింప యత్నించుచుంటిని,

కార—మీ ప్రకటన మెట్టులున్నదో నేను వినవచ్చునా ?

అశో—నేజయించి స్వాధీనమొనర్చుకొనిన ఉత్తరకళింగమునకు దక్షిణసరిహద్దునందు, అనగా ఋషికుల్యానదికి ఉత్తరపు టొడ్డున నున్న 'జౌఘడ' మునకు సమీపమందు నిర్మించిన శిలాశాసనమం దిట్లు చెక్కించితి:—

" జయింపఁబడని ప్రజల స్వతంత్రత నపహరించు నుద్దేశము నా కావంతయు లేదు. నేను వారినిగూడ నా కన్నబిడ్డ లట్లు భావించి వారి యిహపరసౌఖ్యములకు పాటుపడుదును. సమీపనగరమందు నెలకొల్పబడిన నా రాయబారులు నా యభిప్రాయ మెల్లరకు దెలియబఱతురుగాక".

కార—ఇప్పుడు నామనస్సున కించుక శాంతిచేకూరినది.

అశో—నీ కింకొక శుభవార్త చెప్పదునా!

కార—మహాప్రసాదము.

అశో— దేవీ ! నేజయించిన కళింగమండలి పశ్చిమభాగమును వేరొనర్చి అద్దానికి నీవారగు కరవాకులను పాలకులుగ నియమింప నెంచితి. ఆ నూతనరాజ్యమునకు 'కరవాక' రాజ్యమని పేరిడ నెంచితి. ఏమందువు ?

కార—వలదు, వలదు, కరవాకజాతులకు సముద్రప్రాంత భూములందు రాజ్యముండును; కాని పర్వతప్రదేశములలో ఎట్లు కలిగెనని ముందుయుగములవా రెవ్వరైన ప్రశ్నింప నా గుట్టు బయటబడును. నాథా ! చేసిన చెడుకార్యమునకు స్మరణచిహ్నముగ నాపేర నూతనరాజ్య నిర్మాణ మొకటియా ?

అశో— దేవీ! ఐన రాజ్యమే వలదందువా ?

కార—కాదు. ఆపేరు వలదంటిని. మావంశీయులకు 'చెటి' సంజ్ఞ కలదు. మీరు సృష్టింపనున్న ఆ నవ్యరాజవంశము 'చెటి' వంశమని పిలువబడగలదు. కావున మీ రను గ్రహింపనున్న ఆ నూతనరాజ్యమునకు 'చెటి' లేక 'చేది' రాజ్యమని పేరిడిన బాగుండును. మహారాజా ! మీ యనుగ్రహమున:

గీ॥ వేయియేండ్లనుండి నేఁటయిపోయిన
మాల మీలజాతు లొకలి నొకట
గలయఁ దలఁచినారు; ఘనతయు మరలఁ జే
కూరునొక్కొ. క్రొత్త తీరమునకు.

అశో—(కారవాకిని జేరదీసి ముద్దాడి) దేవీ! నీవు సంతసించుట

వలన నాపాపము లన్నియు పరిహరింపఁబడును. ఇంకను నీకోర్కె లేమైనను న్న సెలవిమ్ము. అవశ్య మాచరింతును.

కార—(అశోకునిపై చేయివైచి) ప్రాణనాథా!—

(సిగ్గున తలవంచి యూరకుండును)

అశో—ప్రాణప్రియా! సంశయింపకుము. (బుజ్జగించును.)

కార—నాచర్యకు లోకులు నన్నెట్లు భావించుచున్నారో యను శంక నామనమును వేధించుచున్నది. (మెల్లగా) నాథా! యథార్థమందఱు నెరింగినచో స్త్రీలు చంచల చిత్తులను వాదు లేకుండఁ జేసినవా రగుదురు.

అశో—దేవీ! ఐన ఆ చపలచిత్తము నా కారోపించి నీవు నిర్దోషివి కా నెంచితివా!

కార—యథార్థ మెటులో యటులే ప్రకటింపుడు. మీరు సత్యాన్వేషణమునకు గడంగితిరి కదా!

అశో—(తనలో) ఆకారవికారములచేత స్త్రీలు, పురుషుల వంచించి వారిని పాపకృత్యములకు పురికొల్పుదురు.

శా॥ సల్లాపంబుల, దృష్టిభేదముల, నాశ్వాసంబులన్, జిత్తమం
దుల్లాసంబును గల్గఁజేసి, వశులై యున్నప్డు దుష్కార్యముల్
గొల్లల్ గా నొనరింపఁ జేయుదురు సంకోచంబు లేకుండ, కాం
తల్లావణ్య మెలర్పఁ గాంతులవు; కాంతాలోలు రీ పూరుషుల్.

నిమిత్తమాత్రుఁడగు నీపురుషుఁడు ప్రకృతియను మహాశక్తి చేతిలోని కీలుబొమ్మ.

(ప్రకాశముగా కారవాకి [illegible])



దేవీ! కళింగసామ్రాజ్య వినాశనము [illegible]

రణమునకును నేను నిమిత్తమాత్రుఁడను, కాని యందలి కీర్తియపకీర్తులు నీవి కావా ?

కార—(అశోకుని విడిచి దూరమేగి) నాధా! మరల కళింగ దండయాత్రకు మిమ్ము నేను ప్రేరేపించితి నను చుంటిరా ?

అశో—దేవీ! ఆగ్రహింపకుము. పోనిమ్ము, తన్మూలమున కలిగినబౌద్ధమతోద్ధరణమునకు హేతుభూతు లెవరు ?
(చెంతఁజేరి) నీవు కావా ?

కార—(ముగ్ధత్వము నటించి) అట్లైన, అంతకు పూర్వము మీరొనర్చిన అకృత్యములుకూడ నా నెత్తికె కట్ట నెంచితిరా?

అశో—(చిరునవ్వునవ్వి) దేవీ! స్త్రీజాతి పురుషుఁ డార్జించిన పుణ్యమెల్ల తమ మూలమున కలిగె నందురు; కాని, పాపములు పంచుకొనుట కిచ్చగింపరు. ఆర్జించిన సంపత్తు లనుభవింతురు, కాని పురుషుఁడు పాపకూపమునఁ బడు నప్పుడు వెంట వత్తురా ?

గీ॥ పురుషుఁ డార్జన చేసిన పుణ్యమంత
కలిగెఁ దమ మూలమున నంచుఁ బలుకుచుంద్రు;
అనుభవించెద రార్జించినట్టి ధనము
పాలుగొనఁ బోరు పాపంపు ఫలమునందు.

పోనిమ్ము దానికేమి - ప్రస్తుతము నీవు నిర్దోషివని ప్రపంచమున ప్రకటింపఁబడ వలయునంటివి. నన్నేమి చేయు మందువో? సెలవిమ్ము ?

కార—ఔను, మాటలు మావి; మూటలు మీవి.

అశో—కాదు, పాపముమాది: ఫలముమీది; ఆయాసము మాది: అనుభవము మీది.

కార—(నవ్వి - చేరవచ్చి) నాథా! దానికేమిగాని, కళింగ ముఖద్వారముకడ ఖండగిరి, ఉదయగిరి యను రెండు తిప్పలున్నవి. అయ్యవి అర్హతుల నివాసమున కన్నివిధముల యోగ్యముగ నుండును అచ్చో నెన్నియో చిన్నగుహలున్నవి. వాటియందు జైనముని పరశునాథుని నాటినుండి సాధువులువచ్చి నివసించుచుందురు. ఆ కొండలయందు నాపేర నొక విహారము నిర్మించి, అందు ఈ నాటి నాకథ యంతయు ప్రతిమారూపమున చిత్రింపంచిన, నేను జనాపవాదదూర నగుదును.

అశో—దేవీ! అవశ్య మట్లొనర్తును. అయ్యది రెండంతస్తులు కలగి అన్నివిధముల అర్హతులకు వాసయోగ్యమగునట్లొనర్తును, దానికి 'రాణిగుహ' యని పేరిడుదును. నీ కోరిక ననుసరించి,

'కళింగ రణరంగమునుండి నిన్ను నేను బలాత్కారముగ కైకొని వచ్చి వివాహమాడితి'

అని చిత్రింపించెద—చాలునా ?

కార—మహాప్రసాదము.

అశో—దేవీ! నాకు కొన్ని అత్యవసరకార్యము లున్నవి. మహానుభావుం డుపగుప్తుడు నా కొరకు వేచియుండును. అనుజ్ఞయిచ్చిన పోయివచ్చెద. (లేచి నిలుచుండును.)

కార—మీ యట్టిరు రాణుల కనిపెట్టుకొ కూర్చుండిన రాజకార్యము లెట్లగును! మీ రెప్పుడును ఇచ్చటనే యుండవలెనని నే కోరిన లాభమేమి? (అశోకుని భుజముపై చేయివైచి) కాని, రాజకార్యనిమగ్నులై రాణివాసమును

మరవ వలదని నా ప్రార్థన.

(అశోకుని సాగనంపును.)

కార—(కూర్చుండి - ఆలోచించి) ఉపగుప్తుడు నాకు మొదట మహాశోకకార మొనర్చినను, నాప్రాణనాథు నాకర్షించుటచే నిప్పట్టున నాకు మనోవ్యధ కలిగించుచున్నాడు.

(పరిచారిక ప్రవేశించును)

చెలీ! సార్వభౌము డింత సత్వర మరుగుటకు కారణ మేమై యుండును.

పరి—అమ్మా! ఇది సత్వరమా! మహారాజు ఎప్పుడేగునని నే నరగంట సేపవ్వల కనిపెట్టుకొనియుంటిని. అతఁడాగిన కొలది నీ కోరికల కంతము లేకుండుటచే, ఏదో కారణము కల్పించుకొని అవ్వల కేగినాడు.

కార—(కనులెఱ్ఱజేసి) అందరివలె నే నేమడిగితినే ?

పరి—అదేమో నాకేమి తెలుసునమ్మా.

కార—అత్యావసర రాజకార్యములున్నవని చెప్పి మహారాజు వెడలిపోయెను. ఆకార్యము లెట్టివో నీ వూహింపగలవా?

పరి—రాజుగారి తమ్ముఁడగు విటశోకుఁడు తిర్థయులతో కూడి బౌద్ధ భిక్షువుల పలువిధముల బాధించుచున్నాఁడట. కష్టముల కోర్వలేని సుకుమారి సోమరులందరునుకూడి బుద్ధదేవుని బోధనములపేరుమీాదుగ, దేశమును పాడొనర్చుచున్నారని యాతని యభిప్రాయమట. అహింసామార్గమున మన సార్వభౌము డాతనిని సాధింప యత్నించుచున్నాడు. విటశోకుని మార్గము మారినగాని సార్వభౌముఁడు పాటలీపుత్రమువీడి తీర్థాటనమునకు బయలు వెడలఁడు.

కార——కారణము కర్కశముగనున్నను, నానాథునిపయనమున కంతరాయము కలిగెనని సంతసమగుచున్నది——చెలీ! విటశోకునివిప్లవములవలన నానాథున కెట్టిఅపాయమునురాదు కదా? తీర్థయులు పట్టిదల కలవారని విందును. వారికి పాపభీతిలేదు. అధికార పదవులనుండి తొలఁగింపఁబడిన బ్రాహ్మణు లందనేకు లున్నారని విందుము. వారందరు విటశోకుని ముందుంచి మగధసామ్రాజ్యమందొక మహా విప్లవమును రగుల్కొల్పుచున్నారు. నానాథుఁడు అహింసా మార్గ మవలంబించి యుండుటచే ఆతనికి అపాయము శంకించుచున్నదానను.

పరి——అమ్మా! రాజు బుద్ధధర్మ మవలంబించినను, రాధాగుప్తాదులు అప్రమత్తులై సమ్రాట్టును సంరక్షింపఁ జూతురు.

కార——(ఆతురతతో లేచి —— పరిచారిక గడ్డము పట్టుకొని) తల్లీ! నీవు సత్వరమరిగి, గుప్తచారులనంపి, ఎప్పటి విషయముల ప్పుడు నాకందజేయుచుండుము.

పరి——అమ్మా! అట్లే యొనర్తును. (నిష్క్రమించును)

(తనలో)

గర్భవతికి గాథ రా ఎక్కుడు;
కాదనిన కటిచి చంపును.

( యవనిక జారును. )

నాల్గవ యంకము                                        తృతీయరంగము.

( పాటలీపుత్రమందు వీధి — సంధ్యాసమయము —
భిక్షుకవేషమున కణ్వుఁడు పరుగు పరుగున ప్రవేశించి, అటునిటుచూచి: )

కణ్వ—ఇప్పటికి నా ప్రాణములు గూటఁబడినవి. ఈ మహానగరమున పురపాలకసంఘ ముండుటచే ఇచ్చట రాజకీయోద్యోగుల ఆట లంతగ సాగిరావు. బౌద్ధదేవుని ప్రతిమను పగులగొట్టిరను నెపమున పౌండ్రవర్ధనమం దెందరు బ్రాహ్మణులకు మరణదండన విధింపఁబడెను !

చం॥ దురమున నన్యదేశముల ధూర్తత సాహసరంగమందుఁ బ
ల్వురఁ వధియించుచుండు టది లోక మెఱుంగు; స్వరాజ్యమం దనా
దరణము మీరఁగా మరణదండనమున్ విధియించినాడు భూ
సురులకు, బుద్ధవిగ్రహము చూర్ణముచేసిన కారణంబునన్.

అశోకుఁడు రాజ్యతృష్ణచే నాఁడు సుమనాదులచంపెను. మతావేశముచే నేడు మిగిలియున్న విటశోకునికి మరణదండనము విధించెను. ఏమత మవలంబించినను అశోకునకు బుద్ధిమారినట్లు కాన్పింపదు.

(పనివాండ్రు కొందఱు ఇంటికి మరలివచ్చుచుందురు).

ఎవరా వచ్చెడి వారు ?

పథముఁడు—బాబూ! మేము పనోళ్లం బాబూ.

కణ్వ—మీ రెచ్చటినుండి వచ్చుచున్నారు.

ప్రథ—రాజుగారి కోటనుండి—

కణ్వ్వా—అచ్చట మీరేమిపని చేయుచుంటిరి ?

ప్రథ—నేఁటికి పదిరోజులనుండి కోటలో రాతికొట్టొకటి కట్టి నాం. ఇప్పుడు ప్రభువోరి సెలవుప్రకారం, కోటప్రక్క కొండ ఒకటి వేస్తున్నాం.

కణ్వ్వా—కొండ వెయ్యడమను ఏమిటిరా—కోతిముండాకొడకా!

ద్వితీ—బాగా సెప్పినావు బాబూ, ఐతే మేము హనుమంత య్యంతోళ్లమన్నమాటే—

తృతీ—ఒరే ఎవరనుకున్నావురా? సూసుకోమాట్లాడు. కొం డయ్యగారికొడుకు కన్నయ్యగారు — బాబు, కన్నయ్య బాబు! చిన్నోడు, సమించాల. ఏఁటంటే – ఏలినోరు చిన్న బాబయ్యకు సిచ్చసెప్పినారు. గొప్పోళ్లు గనక కోటలో కొట్టుకట్టి అందుంచినారు బాబూ; ఖైదన్నమాటేగాని, ఆతని కేఁటి లోపం—మాలాంటోళ్లు కసింత తప్పు సేస్తే కఠినశిక్ష చేస్తారు. గొప్పోళ్లకి కొండంత తప్పుచేస్తే, కొట్టు లోపెట్టి కోడెపెయ్యనాఁగు మేపుతారు.

కణ్వ్వా—ఔరా! అతడు చేసిన తప్పేమిటి ?

తృతీ—తప్పన్నా తప్పా—బాబు— మహారాజు కూకుండే సింగాసనంమీఁద చిన్నబాబు కూసోని, నేనే రాజన్నాడట.

కణ్వ్వా—(తనలో) విటశోకుఁ డిట్లు వేగిరపడుటకు కారణమేమై యుండును ? ఇయ్యది రాధాగుప్తాదుల కుతంత్రమై యుండును.

(ప్రకాశముగా)

ఔరా! కొండ వేయుచున్నామంటిరే. అదెందుకు ?

తృతీ—అద్దదా—ముందు ఆచిన్నయ్యని రాజుసంపేమన్నాడు. కాని మనూరికి కొత్తగొచ్చిన, బోడిదాసరయ్యనా గున్నాడు—

ద్వితీ—సన్నాసయ్య అనరా—

ప్రథ—కాదురా—బిచ్చమయ్యగారురా.

తృతీ—ఎవరైతే నేమిరా—ఆగుప్తయ్యో,తిస్సయ్యో, రాజుగారిక్కి బుద్ధిసెప్పితే, ఓరం రోజు లూరుకుంటానన్నాడు.

ద్వితీ—బాబు, ఆ చిన్నయ్యసావలేదన్నమాటేగాని, సచ్చినంతైనాడు. ఏం పెట్టినా తినడు—పల్లకుంటాడు.

తృతీ—ఇప్పుడు ఆ చిన్నయ్యగారు బమ్మమతం వదలి బుద్ధిమతంలో కలిగిపోనాడట. కోటలు, పేటలు వదిలేసి కొండల్లో కెల్తానన్నాడు. ఏలోళ్ళరు, ఇల్లొదలి ఇటకొకయ్య ఎల్లిపోతే యవ్వారం ఎనాగతిరుగుతాదో అని, కోట పక్కనే సిన్నబాబునుంచడానికి కొండకట్టిస్తున్నాడు బాబు.

ద్వితీ—అద్దదీ—ఆ కొండ మా మిప్పు డేస్తున్నాం బాబు.

కణ్వ— (ఆలోచించి - తలపంకించి)

ఔరా! మీ రెప్పుడు బుద్ధిమతంలో కలుస్తారు ?

ప్రథ—అయ్యా ! మాకెందుకయ్యా ఆమతం. మాది కడుపు మతం. కాలాడితేగాని కడుపాడదు మాకు. మీనాగు ముక్కుమూసుకొని మూలకూకుంటే మాకెనా గౌతుంది పిల్లా పిచకా మాడిపోరా బాబూ!

తృతీ—ఎందుకురా బాల్లిమాటలు పెద్దోడా—సంవత్సరం పొడుగునా పొలంలో కష్టపడి, రత్తమంతా నీరుచేసుకొని పండించిన పంట మన వెంత తింటున్నాంరా—పన్నులంట, బాగాలంట; దేవుడికంట, దయ్యాలకంట; ధర్మాలకంట, దండుగులకంట, సండుగులకంట—అంతాపోతే రోజుకి సోలెడుగింజలు మిగుల్తాయి నేదో--అవి దప్పితాగి ఎలాగు బదకడం బాబూ—నువ్వే సెప్పు.

ద్వితీ—నీకడుపు సల్లగా - బాగా సెప్పినావురా? కడుపుకి నేకుంటే కైలాసం ఎందుకురా మనకి—

ప్రథ—మంచి చదువు చదివినారురా! పల్లకోండిరా.

(లోపల)

" రెండవజాము ప్రారంభమయే సరికి నగరమంతా నిశ్శబ్దముగ నుండవలెను. వేడుక మందిరములయందు గాని, విలాసభవనములయందు గాని, ఎవ్వరునుండ రాదు. ఇది సార్వభౌముని ఆదేశము.

చెప్పలేదనెదరు—జాగ్రత్త "

కణ్వ—వింటిరా, బుద్ధిమతముయొక్క ప్రభావము.

ద్వితీ—మాకెందుకు బాబు, ఆగొడవ - అమ్మతల్లి సల్లగుంటే అంతేచాలు. మతాలమాట మాకెందుకు—అదేదో ఆరూ మీరూ సూసుకోండి. ఇంటికెళ్లి యింత గంజో, అంబలో, తాగి కళ్లుమూసుకొని కమ్మగ తొంగునే మాకెవ శేఁవిటి సెయ్యాలి. (నిష్క్రమింతురు.)

కణ్వుడు—(స్వగతము)

జనసామాన్యమునకు భయముచేతగాని భక్తికుదురదు.

కాలముననుసరించి హిందూసంఘమందుకూడ కొన్ని మార్పులు చేయవలసియున్నది. అనార్య శూద్రజాతులు ఆదినుండియు పూజించుచున్న వృక్షములకును, జంతువులకును ఈశ్వరత్వము ప్రసాదించి ఆర్యదేవతాగణంబున జేర్చినగాని వైదికమత మభివృద్ధిగాంచ నేరదు.

అత్రి, భరద్వాజ, గౌతమ, అంగిరస, వాలఖిల్యాదు లెందరో మౌర్యుని బాధపడలేక, మధ్యదేశమువీడి కావేరి తామ్రపర్ణితీరములకు వలసపోయిరి. విటాశోకుం డిట్లు భ్రష్టుం డయ్యెను. దినదినమునకును వైదికమత మిట్లువన్నె వాయుచు న్నది. ఇళా, పింగళుల మార్గమవలంబించి బ్రాహ్మణులు బౌద్ధ మతమందు దూరినగాని యద్దాని నంత మొందించుట కష్టముగ కాన్పించుచున్నది.

(ఆలోచించి - తలపంకించి) ఈ అశోకుఁడు ప్రజల ఐహిక సంపత్తులపై తనకున్న నిరంకుశాధికారముతో తృప్తిపొందక, వారి ఆముష్మిక చింతలనుకూడ తన చేజిక్కించుకొన యత్నిం చుచున్నాడు. కాకున్న మతసభలందు సార్వభౌమునకు సభాధి పత్యమేల? అశోకునకు బౌద్ధమతముపై నభిమానముకన్న అధికారతృష్ణయే యాతని నిట్టి అక్రమ కార్యములకు రేపెట్టు చున్నట్లున్నది. మతమను మాయవేష మూసనగాని అందరి నాకర్షించు టెట్లు ?

చ॥ అతిశయ రాజ్యతృష్ణపయి, నాశలు తీరక, యంతకెక్కుఁడౌ
మతమను పేరిటన్ జనుల మానసముల్ హరియింప నెంచి, యీ
గతి నొనరింపఁబోలు; నటుగాని యొప్పెన్, విచారింప మేదినీ
పతికి మతార్థమా సభలఁ బాల్గొనుమందుట న్యాయమౌనకో॥

నిజమాడిన నిష్ఠురము. బ్రతుకుపై నాశయున్నవారు భావనల వెలిబుచ్చరాదు. కావున, అందరితోఁగూడి నేనును అశోకచక్రవర్తి ఆర్యావర్తము నుద్ధరింప నవతరించిన మహాపురుషుఁ డందును. ఈశ్వరానుగ్రహ మున్నడిన నిజము నిలుకడ మీఁద వ్యక్తము కాకుండునా ?

( నిష్క్రమించును. )

---

# కౌ ర వా కి

పంచమాంకము. ప్రథమరంగము.

(భారద్వాజుని ఇల్లు—కౌశికభరద్వాజులు కూర్చుండి యుందురు.)

కౌశి—మిత్రమా! మీరు చెప్పిన మాట నిజమే. మనకణ్వుఁడు మూఁడురోజుల క్రిందట కూలివాండ్రతో కోటలోనికేగి విట శోకునితో మాటాడి వచ్చినాడు. లాభమున్నట్లుకనిపించదు.

భర—గడ్డిబొద్దును గంగిరెద్దుఁజేసి యాడింప మనవాఁడు యత్నించెను. మిత్రమా! వట్టి చవిటి నేలను నాటిన విత్తైన్నఁడైనను మొలచి ఫలించునా? బిందుసారుని సంతానములో విటశోకుఁడు కుక్కమూతి పిందె. ఆగుడ్డిగేదెను తెచ్చి శ్రీమహాలక్ష్మినిజేయ మనవాడు యత్నించెను.

కౌశి—అట్లయిన బీజము కన్న క్షేత్రమునకే యెక్కుఁడు ప్రాముఖ్యత కలదందురా?

భర—అందుకు సందేహమేమి? క్షత్రియులు మాత్రము క్షాత్రముతో సంబంధము లేదని వాదించెదరు. మనవా రందుల కంగీకరింపరు—మనకు క్షేత్రమే ప్రధానము.

కౌశి—విద్యవిషయమై మీ యభిప్రాయమేమి?

భర—విద్యవిషయమై కూడనంతే. సంఘుసంపర్కమే చాల వఱకు మనుజుని మంచిచెడ్డల నిర్ణయించును. క్షత్రియస్త్రీకి జన్మించిన న్యగ్రోధుఁడు కళింగమందు ప్రాప్తించిన బౌద్ధ

భిక్షువుల సాంగత్యముచే పరమసాధువై ప్రపంచమున కెంత యుపచరించుచున్నాఁడో చూడుము ! బ్రాహ్మణ స్త్రీయైన సుభద్రాంగికి బుట్టియు మనయశోకుఁడు మాళవ యందు కఱకుకిరాతుల నడుమ కలకాల ముండుటచే నాతనికి వారిక్రూరత్వ మంఁవడినది.

కాశి—కడకు అశోకుఁడు సన్మార్గానువర్తి యగుట కేమందురు?

భర—అదికూడ సాంగత్యఫలితమే. పాపముపండి, పరితప్త హృదయుఁడై యున్న అశోకునకు ఇంటను, వాకిటను, గూడ సత్సాంగత్యము ప్రాప్తించెను. కళింగమునుండి యేతెంచిన కారవాకియు, ఉపగుప్తుఁడును, చెవినిల్లు కట్టు కొని పోరుచుండ అశోకుఁడు సన్మార్గాను వర్తి కాకుండు టెట్లు ?

కాశి—మిత్రమా, మనకణ్వుని ప్రయత్నము లేలఫలింపకున్నవి? అందున్న లోపమేమి ?

భర—వైదికమతమందు లోపములేదు. కణ్వుని ఉత్సాహాము నకును మేరలేదు. కాని ఆతఁ డుపయోగించుచున్న ఆయుధ ము లప్రయోజకము లగుచున్నవి. నేఁడుకాకున్న రేపైన నాతని ఆశయములకు విజయము ప్రాప్తింపఁ గలదు.

కాని కణ్వునియం దొక గొప్పలోప మున్నది.

గీ॥ ఆత్మమతముపై నభిమాన మలరు కన్న
పరమతద్వేష మాతని బాధపెట్టు;
స్వమతరక్షణ కీతండు సంతసించు;
పరమతద్వేష మెప్పుడు పనికిరాదు.

ప్రేమచే పెక్కు కార్యముల సాధింపనగును.

కౌశి—విటశోకుని మూలమున మనవాఁడు విఫలమనోరథుఁడు కావలసివచ్చెను.

భర—హిందూసంఘమందు నేడు మన మనుభవించుచున్న నిరంకుశాధికారమునకు విఘాతముకలుగు నన్నభీతిచే మనము బుద్ధదేవుని బోధనల . దృఢీకరించుచున్నాము. అయ్యదికూడ అశోకుని ధర్మబోధనముల కెక్కుఁడు బలమొసంగుచున్నది.

కౌశి—మిత్రమా! క్షమింపుము. అశోకుఁడు బౌద్ధధర్మము నుద్ధరించుటకు కారణములు వేఱు. నేఁడు మౌర్యసామ్రాజ్యము మితిమీరియున్నది. ప్రజల నిర్వీర్యుల నొనర్చిన గాని అశోకుని అధికారమునకు భంగము వాటిల్లకతప్పదు. మనయందరను తనకు నిరంతరము దాసులొనర్చుకొనుట కశోకుఁడు నిర్వీర్యమైన బుద్ధదేవుని మత ముద్ధరింప బద్ధకంకణుఁడై యున్నాఁడు.

భర—కౌశికా! అశోకుని విషయమై మీరంత కూరిరముగ నాలోచింపరాదు. నిర్హేతుకముగ నితరుల నిందింపరాదు. ఈనాఁడు మనచక్రవర్తి ప్రతిష్ఠించుచున్న శిలాశాసనములే ముందుయుగములకు నిలిచియుండును. గౌతమబుద్ధుని అహింసామతము హిందూమతమున లీనమై మన భరత వర్షము దదృశ్యత జెందినను, అశోకుని ధర్మశాసనములు మాత్రము ఆచంద్రతారార్కము నిలిచియుండును. ఈ నాఁడు నీచేనిందింపఁబడుచున్న అశోకుఁడే ముందుయుగాల వారికి మార్గదర్శికాఁ గలఁడు. అశోకుని తాత్కాలికోద్దేశ మేమైనను, అతఁ డొనర్చిన ధర్మకార్యములవలన భరతవర్షమునకు ప్రపంచచరిత్రయం దగ్రస్థాన మార్జించుకొనుచున్నాఁడు.

ఉ. ప్రేమను బుద్ధదేవుఁడు పరీక్ష నొసంగ నెసంగు నియ్యహిం
సామత మంతరించి చనుఁ జయ్యన భారతభూమినుండి,
యీపై మన భూపుఁ డీ శిలలపై లిఖియించిన శాసనమ్ము లే
భూమిని నిల్చియుండు పరిపూర్ణమహాత్వ్య మహింసకిచ్చుచున్.

ఉద్దేశము లూహ్యములు; ఇంక కర్మములా ప్రత్యక్షనిదర్శనములు. అశోకుని ధర్మకార్యములయెడ దురుద్దేశముల నారోపించి మన మేల కళంకీభూతులము కావలయును ?

కాశి—ఆర్యా! బౌద్ధధర్మము మనహిందూమతమున లీనమగునని యంటిరి. అది ఎట్లు సాధ్యమగును?

భర—బుద్ధదేవుని సద్ధర్మబోధనల యందు ఆకారశూన్యమగు నేకేశ్వరోపాసనము మిళితమొనర్చి, 'అహం బ్రహ్మాస్మి' అను అద్వైతసిద్ధాంతము బోధింప మొదలిడినచో వైదిక మతము పునర్జీవిత మగును. బౌద్ధమతము తనంతట తా నంతరించును.

కాశి—విటశోకుని అధఃపతనమునకు కారణ మడుగవచ్చునా?

భర—అట్లడుగుము. విటశోకునియందు ఆర్యమతోద్ధరణ వాంఛకన్న అధికారతృష్ణ యధికముగ నున్నది. లోకానుభవ మెక్కుడుగ లేకుండుటచే మొదటి యపజయమే యాతని నిరుత్సాహునిఁ జేసి నిర్వీర్యు నొనర్చెను. అంతటి దురభిమానమున్నవాఁడు నాయకత్వమూన రాదు. మహత్తరకార్యములు మాటలతో కానేరవు.

కాశి—మిత్రమా ! అశోకుఁడు అబ్రాహ్మణోద్యమము నాదరించుటచే మనవారి కెక్కు డపకారమగుచున్నది. ఉన్న తావు లూడుటచే నెందరో తిండిలేక తిరుగుచున్నారు!

భర— గీ॥ పల్లెటూళ్ళ వీడి, పట్నాల కేతెంచి,
యున్న దూడిపోయి యూఁగు మిపుడు;
నాగరికత పేర, నగరాలలో దుర
భ్యాసతతియె ప్రజలఁ బాడుసేయు.

ఈ మహానగరముల నావరించియున్న దురభ్యాసములు బ్రాహ్మణుల ఐహికాముష్మికాభివృద్ధికి ప్రబల ఆటంకము కలిగించుచున్నవి. భరతవర్షమందలి ఆధ్యాత్మికశక్తి అంతరింపకుండగనే నరికట్టుటకై ఈశ్వరుఁడే యీయబ్రాహ్మణోద్యమమును కల్పించి ప్రోత్సహించుచున్నాఁడని నే నూహింతును.

భరతవర్షమందు సగటున నూటికి ఇద్దరువంతున బ్రాహ్మణులున్నారు. బ్రాహ్మణులు లేని పల్లెలెన్నియో గలవు. ఈపాడుపట్టణముల వదలి మనము పల్లెలకేగినచో అనాయాసముగ జీవింపఁగలము. కడుపుకక్కుఱితికి లేనిపోని వేషముల వేసికొనివారల కాళ్లుపట్టి పట్టణములందుండి పాడగుటకన్న, కుగ్రామములకేగి కులవృత్తి ప్రారంభించుట సర్వవిధముల శ్రేయోదాయక మగును. హిందూసంఘమునకును, వైదిక మతమునకునుమహోపకార మొనర్చినవారమగుదుము. మీయా వేషములమానినయెడల మరినాల్గువత్సరములు బ్రతుకవచ్చును.

గీ॥ పట్టణాలలోన బ్రతుకఁ జాలము కాని,
పల్లెటూళ్లలోన బ్రతుకఁ గలము;
పట్టణాలనుండి పాడగు కంటెను
స్వకులవృత్తిఁ బల్లెఁ బ్రతుకఁ దగదె.

కౌశి—మిత్రమా! నీ వనేకవిషయములయందు నాకు నూతన దృష్టిని ప్రసాదించి మహోపకార మొనర్చితివి. ఉపగుప్తాదులు కోటకేగు వేళయైనది. వారి పోకడలు కనుఁగొని వచ్చెద. సెలవిమ్ము.

భర—నాకును, మాధ్యాహ్నిక మొనర్చుకొనుటకు వేళ యతిక్రమించుచున్నది.                (నిష్క్రమింతురు)

# కారవాకి

పంచమాంకము　　　　ద్వితీయరంగము

(పాటలీపుత్రమందలి కారవాకి అంతిపురము—కారవాకి కూర్చుండియుండును కళింగపరిచారిక చెంత నిలిచియుండును.)

పరి—అమ్మా! తొందర పడరాదని నాయభిప్రాయము. మావంటివారు సంసారమును వీడి సన్యసించినఁగాని మానవకోటిని సేవించి తరించుటకు వీలులేదు, ఇంక నీవన్ననో ఇంటనుండినచో ఏందరికో ఎక్కుడుగ ఉపచరింపఁగలవు.

కార—చెలీ! సంసారసంబంధములు త్రెంపకుండిన సర్వసమత్వము చేకూరనేరదు. అంతదనుక ఆత్మాభివృద్ధి కలుగదు. డబ్బు వెచ్చించినంతనే ధర్మముచేకూరునా? కాయకష్టము లనుభవించినగాని పరుల కష్టముల గుర్తింప నేరము.

పరి—అమ్మా! ఆజన్మసుకుమారివి నీవు, సంఘ నియమములు పాటింపలేవని భయమొందు చున్నాను.

కార—చెలీ బుద్ధదేవుని కన్న నాకెక్కుడు సౌకుమార్యమా!

గీ॥ పుట్టె రాజాగ్రగణ్యుఁ, బూర్ణ యౌవనమున
నాలిబిడ్డ విడిచి యడవి కరిగె;
ననుభవించెఁ గష్ట మా మహాత్మునికన్న
మనము గొప్పవారమా తలంప ?

మహాత్ముఁడు పడినకష్టముల తలఁచుకొనిన మనభయములు భంగమొందును.

పరి—అట్లైన, కళింగమందు నీవేల సన్యసింపలేదు ?

కార-కాలమును కర్మమును కూడినగాని అట్టిచింతలుపొడమవు. కరవాక జాతియందు పుట్టి కళింగ యువరాజును చెట్టపట్టిన నేను, మగధ సార్వభౌముని ద్వితీయ మహాదేవి నగుదు నని కలనైనఁ దలంచి యుంటినా? జగన్నాటకసూత్రధారి యనుగ్రహించి యింకను నాచే నేమిచేయింప నున్నాఁడో!

చెలీ! నాకు మాత్రము సంసార సుఖములపై విరక్తి జనించినది. కారణమేమో చెప్పలేను.

పరి—అమ్మా! నీవవతరించి మనకరవాక కులమునకు వన్నె తెచ్చితివి. నీ మూలమున చెట్టివారు నేఁడో రేపో రాజ్యము లేలనున్నారు. మూలఁబడియున్న బౌద్ధ మతమును అశోకుఁ డవలంబించి ముందుకు గొనివచ్చుటకు కారకు రాలవు నీవుకావా-తల్లీ! ఇంక కొంతకాలము కోటయందు నీవు నిలిచియుండిన ఆమహారాజుచే నెట్టి మహత్తర కార్యములు చేయింతువోకదా! 'ఖండగిరి' కొండలయం దేమున్న దమ్మా ?

కార—(చెవులు మూసికొని—విసుగు నభినయించి) చెలీ, మహాత్ము డుపగుప్తుఁడుండ, సకలసద్గుణరాసి అఖిల తేజోవంతుఁ డా న్యగ్రోధుడుండ, దండధరునిబోలె ధర్మ అశోకుడుండ, ఏమీ! బౌద్ధమతోద్ధరణము నాచేగావింపఁ బడినదని చెప్పుచుంటివా? ఇట్టి అనృతవాక్యములాడి నాయం దంతరించుచున్న అహంకారాగ్నిని మరల మరల రగుల్కొల్పఁ జూచుచుంటివా ?

(పరిచారిక మాటాడ యత్నించును)

చాలు—చాలు ఇంక నీ ముఖస్తుతులు కట్టిపెట్టుము. విని విని నేను విసుగొందుచున్నాను.

పరి—అమ్మా! ఆగ్రహింపకుము. నీకన్న ఈ పసికూననైన కరుణించి నీవు కొంతకాలము కోటయందునిలువకతప్పదు.

కార—వెఱ్ఱిదానా, సార్వభౌముని పట్టికి సంరక్షణ లోప ముండునా? సంసారమున నిలిచినకొలఁది, సంకెల లధిక మగును.

గీ॥ చటుల శృంఖల కద సంసార మక్కటా,
యరయఁ గొలఁది బంధ మధిక మగును;
కూడఁ దీయుచున్నకొలఁది యధోగతి
కాని, ముక్తియెపుడు గానఁబడదు.

ఈ పాపకూపమునకు పరిమితి కాన్పింపదు. ఇందునిలిచి యున్నకొలఁది ఆత్మకు అధోగతియేగాని ఔన్నత్యము లేదు.

పరి—అమ్మా! సార్వభౌముఁడు సామ్రాజ్యమును సంఘమున కర్పించి సన్యసించునని వినుచున్నాము. అటులైన ఈపసి పాపని గతియేమి? (విచార మభినయించును)

కార—(ఆనంద మభినయించి) ఏమి! ఏమి! నానాథుఁడు సన్య సించునా! ఆహా! చెలీ, ఎట్టి సంతోషవార్త కొనివచ్చితివి నిన్నెట్లు బహూకరింపఁ గలుగుదును! (మెడనున్న హారములు తీసి పరిచారిక మెడలోవేసి) ఈ నా స్వల్ప బహుమాన మునకు మన్నింపుము. (దీనముగా ఆమె చేతులుపట్టుకొనును.)

పరి—అమ్మా! నీ చర్యలు నాకు బోధపడకున్నవి. [తనలో] ఈమెకు ఒకవిధమగు ఉన్మాదావస్థ ప్రారంభమైనట్లున్నది.

(కారవాకిని ఆసనముపై గూర్చుండబెట్టి లోని కరుగును.)

కార—(కనులు మూసికొని - ఆలోచించుచు నిట్టూర్పునిగిడ్చి) ఆడువారికి అన్నియు నాటంకములే. నే నీ బంధనముల త్రెంపుకొనుటెట్లు నాథా నీవు నన్ను వీడుచుంటివి. జగన్నాథుని చెంతకరుగుటకు నాకనుజ్ఞయిమ్ము.

[బాలు నెత్తుకొని పరిచారిక మెల్లగ ప్రవేశించి బాలుని కారవాకి యొడియందుంచును.)

కార—(బాలు నెత్తుకొని, నిదానించి, కన్నులనీరు పెట్టుకొని ముద్దాడి )

గీ॥ నన్ను గన్నతండ్రీ, నా ముద్దులకొటార,
నాతపఃఫలంబ, నాకుమార;
నిన్ను వీడియెట్లు నిలువఁగాఁ జాలుదు ?

హా, నీ కొఱకా నే నింట నిలువ వలసినది? (ఆలోచించి) కానిమ్ము. అబ్బా! ప్రేమ బంధము లెంత కఠినములు! ఈ ప్రేమ బంధ మెట్లు త్రెంపనగును ?

(పరిచారికను పరీక్షించి) చెలీ, నీ ఋణము నే నెట్లు తీర్చుకొందును ? సంసారమును త్యజించి సన్న్యాసినినై నా కొఱకు కళింగమునుండి కాలినడకను పాటలీపుత్రమున కేతెంచితివి. ఆహారపానీయములవీడి జైనయతుల మార్గమవలంబించి చావనున్న నాకు సంసారసుఖములయం దాసక్తి పుట్టించితివి. నేఁడు నేను సర్వసంగపరిత్యాగ మొనర్ప సంకల్పించుకొని యుండ ఈబాలుని నాయొడియందుంచి మరల నన్ను మోహాంధకారమునఁ బడఁ దోయుచుంటివి. ఇం కెంత కాలము నీవు నన్నిట్లాడింతువో తెలియకున్నది.

పరి—అమ్మా! ఆత్మలాభముకోరి నేనిట్లాచరించు చుంటిననియా

నీ యభిప్రాయము ? చండాశోకునకు నీయం దపరిమితానురాగ ముండుట గుర్తెఱింగి నీ మూలమున నాతనిని ధర్మాశోకు నొనర్చినఁగాని మానవకోటికి మంగళము చేకూరదను తలంపున నిన్ను నేను సంసారసాగరమున దించితిని. అందులకు నన్ను క్షమింపుము.

ఒకవ్యక్తి అధఃపతన మొందినదే యని తలంచినను, అందువలన కోట్లకొలఁది ప్రజలు నేఁడు ధర్మసామ్రాజ్య మను భవించుచున్నారు. తల్లీ! నీ జన్మకింతకన్న పావనత యున్నదా!

కట్టుకొనినభర్తను, కన్నకొడుకులను, వీడి, యింతదూర మేకాకినై యేతెంచుట ఎందులకు? చిన్ననాటనుండియు ప్రాణ తుల్యముగ ప్రేమించి సేవించుచున్న నిన్ను వీడియుండలేక నేకదా? నీ ఔన్నత్యము కన్నులారగాంచి ఆనందించుటే నాజన్మకు పరమావధిగ నెంతును. నే నెట్టి కష్టములనైనఁ బడుదును గాని నీవు నిర్వ్యాకుల్లంతయైన కసిగందిన నేనోర్వజాలను.

శార — ఔను. అందుచేత నే బౌద్ధ దీక్షబూని సన్న్యాసినినైన నీవు, నన్ను సంసారమువీడవలదని బలాత్కరించుచున్నావు. నీకు నాయం దభిమానములేదని నే ననఁగలనా !

కాని, నీకు నాయందున్న అపరిమితానురాగమే నా యధఃపతనమునకు కారణమగుచున్నదంటిని. (ఆలోచించి) చెలీ! నామాటల కలుగకుము. మతిచెడి మాటాడుచుంటిని. ఈకూన నావలకు గొంపొమ్ము. ఇంచుకంత నిదురించినఁగాని నాకు మనసు కుదురువడదు.

(పరిచారిక బాలునితో నిష్క్రమించును).

(కారవాకి పండుకొని — తనలో)

నానాథుఁడు సామ్రాజ్యమును సంఘమున కర్పించి సన్న్యసింప నున్నాఁడా! నాకు బంధవిమోచనము ప్రాప్తించు టెట్లు? పురుషులు ఇచ్ఛామాత్రమున ముక్తిని బడయఁగలరు. మగువలు సంసారసాగరమున మునిఁగి యుండవలసినదేనా?

(నిద్రించును).

(యవనిక జారును)

---

పంచమాంకము  తృతీయరంగము

(పాటలీపుత్రసంస్థ వీధి — పౌరులు - జాంఘికుఁడు ప్రవేశింతురు)

జాంఘికుఁడు—చెప్పలేదంటూరు! వినలేదంటూరు? జాగ్రత్త.

నేఁడు ధీవర దేవుని పుట్టినదినము. కోటదగ్గర బీదవారి కిని భిక్షువులకును కూడూగుడ్డాయిస్తారు. ఖైదీలందరు విడిచి పెట్టబడతారు. అందరూ అక్కడికి రండీ.

(తుడుము మోదుచు నిష్క్రమించును)

ప్రథ—కౌరవాకిదేవికి పుట్టిన కొమారునకెట్టి వైభవములు జరుగుచున్నవి? భార్యయందున్న అనురాగమును బట్టియే పుత్రునిపై ప్రేమ యుద్భవించుచుండును. మహేంద్రాదులు పుట్టిన మాటయే మన మెఱుగము.

ద్వితీ—మిత్రమా, అట్లనెదవేల ? కౌరవాకిదేవి కోటలో కాలిడిననాఁటనుండియు నశోకుఁడు క్రూరకృత్యములమాని నాఁడు. మతము మాటకేమిగాని, ఆమె విచ్చేసిన నాఁటి నుండియు బ్రజల కెక్కుఁడు సౌఖ్యముగనున్నది. బాటలు బాగుపడినవి. అడుగడుగునకును మంచినీటి బావులు, మార్గమందంతటను మధురఫలవృక్షములు—ఆమడ కొక శ్రమదాంగి—పాంథులభాగ్యము చెప్పశక్యము కాకు న్నది. నూతనముగ సామ్రాజ్యమంతటను నెలకొల్పఁ బడిన ఈ చికిత్సాలయములు మనుష్యులకును, జంతువు లకును కూడ, నెంతో ఉపయోగముగనున్నది.

ప్రథ—సార్వభౌముఁడు ఈపసిబాలునకు యౌవరాజ్యపట్టము

కూడ కట్టునట. కాని ఆబాలుని బ్రతుకు విషయమై ప్రబలసందేహము కలదు.

ద్వితీ—ఏల యట్లనుచున్నావు? నీవాబాలుని జాతకము పరీక్షింపలేదుకదా. పాపము శమించుగాక. మిత్రమా! నీకు జాతకములయందు మారకభాగమందే యెక్కుడు పరిచయ మున్నట్లున్నది. విటశోకునివిషయమై నీయభిప్రాయ మేమి?

ప్రథ—చచ్చినవాని విషయమై ప్రశ్నయేల ?

ద్వితీ—అనఁగా—

ప్రథ—మరణభీతిచే మనరాజుగారితమ్ముఁడు మతిచెడి 'దేశాంతరములకు పారిపోయిన' సంగతి నీకు తెలియునుగదా. పాండ్యదేశమున నాతనిపట్టుకొని నిర్గ్రంధుఁడని భావించి వాని నచ్చో చంపిరి.

ద్వితీ—పాపము—మిత్రమా! విదిశాపురీదేవి కొమారుఁడగు మహేంద్రుఁడు యువరాజుగా నున్నాఁడుగదా, ధీవరదేవుని కాపదవి నెట్లిత్తురు ?

ప్రథ—ఇంకను నీవు నిన్నటి దారియందున్నావు. మహారాజు సామ్రాజ్యమందలి లౌక్య వైదిక వ్యవహారములన్నియు చేఁజిక్కించుకొనుటకు యత్నించుచున్నాఁడు. అందుకే బ్రాహ్మణమతము మూలఁబట్టించినాఁడు. జాతిభేదము లేని బౌద్ధమతమును ముందుకుఁ దెచ్చినాఁడు.

ద్వితీ—సంసారమును త్యజించిన సన్యాసులుగాని బౌద్ధసంఘమందు నీతాధ్యక్షులగుటకు వీలులేదుకదా, అమిత స్త్రీలోలుఁడగు నశోకుఁ డెట్లాపదవికి అర్హుఁడాయెను ?

ప్రథ—కావుననే మహేంద్రునకు సన్యాసమిప్పించి సంఘాధ్యక్షునిచేసినాఁడు.

ద్వితీ—ఐన ముద్గల శిష్యుఁ డేమగును ?
ప్రధ—వచ్చినదారిఁబట్టి నట్టడవుల కేగును.
ద్వితీ—అట్లైన, నేఁటినుండియు బౌద్ధసంఘము సంకరమగుట నిశ్చయము. కాని అశోకునియందున్న భయముచేత ప్రజలు బౌద్ధధర్మమును ప్రస్తుతము పాటింతురు. కాని యాతని యనంతరము ఈమత మెంతకాలమో ఆర్యావర్తమున నిలువ నేరదు.

(లోపల ధ్వని)

"వనమృగముల వేటాడ రాదు. నీటియందున్న చేపల పట్టరాదు. జంతుహింస చేయరాదు. జీవహింసకలిగించు నెట్టి వినోదములయందును ప్రజలు పాల్గొనరాదు. మద్యపానమును, మాంసభక్షణమును, మానినవారు మహారాజానుగ్రహామునకు పాత్రులగుదురు". (భేరీమోగును)

ప్రధ—ఔరా! సామ్రాజ్యము సన్యాసి ఆశ్రమముగ మారుచున్నది. ఈనిర్బంధయతీశ్వరత్వ మెన్నిదినములుండునో!
ద్వితీ—ఎక్కడ చూచినను నేఁడీ 'ధర్మఘోషయే' వినఁబడుచున్నది. కళింగమునుండి శారవాకి వచ్చిననాటినుండియు, 'భేరీఘోష' యదృశ్యమైనది. అశోకుఁడు ఈధర్మప్రబోధముల విదేశములకుగూడ నంప నుద్యుక్తుఁడై యున్నాఁడట.

మిత్రమా! చండాశోకుని ధర్మాశోకునిగ మార్చిన శారవాకిదేవి శక్తిసామర్థ్యము లేమనవచ్చును! ఆర్యావర్తమున అశోకునిచే ధర్మసామ్రాజ్యప్రతిష్ఠాపనము చేయించి నీజన్మసార్థక మొనర్చుకొంటివి. శారవాకీ, ధన్యురాలవు—శారవాకీ, ధన్యురాలవు— (నిష్క్రమింతురు).

# కౌ ర వా కి

పంచమాంకము చతుర్థరంగము

పాటలీపుత్రమందలి వీథి,

(జాంఘికుఁడు ప్రవేశించి)

నేఁడు కోటయందలి ఉపవనమున జరుగనున్న మహాసభకు సర్వమతములవారును సార్వభౌమునిచే నాహ్వానింపఁ బడుచున్నారు. అన్ని మతములవారును ఒకేరీతిని గౌరవింపబడుదురు. సంసారులు, సన్యాసులు అను భేదములేక పాత్రోచితముగ దానధర్మము లియ్య బడును. మతవాదములయం దందరు నొకేరీతిని పాల్గొనవచ్చును. ఇతర మతముల నిర్హేతుకముగ నిందించువారుమాత్రము సార్వభౌముని ఆగ్రహమునకు పాత్రులగుదురు.

(అని నిష్క్రమించును)

# కారవాకి

పంచమాంకము　　　　　　　　　　　　　　　　　　　　　　పంచమరంగము.

(పాటలీపుత్రమున కోటయందలి ఉపవనము, తిన్నెపై భిక్షువులు, శ్రామణులు, బ్రాహ్మణులు కూర్చుండి యుందురు.)

న్యగ్రో—సీ॥ హింసామయంబులై యొసఁగు కర్మలఁ జేసి
యానంద మొందఁగా నరయనేల?
పెద్దలయెడభక్తి, ప్రీతిసజ్జనులందు,
నాశ్రితులందు ప్రేమాతిశయము,
ప్రాణికోటులపై నపారకారుణ్యంబు
గురుజనులందు నకుంఠరక్తి,
ధర్మమార్గమున నుత్తమమైన యాసక్తి
హింసకుమారమై యొసఁగుగరిత

గలుగ, నానంద మన్నిటఁ గలవఁ గలుగు
ధనము, ధాన్యంబు, పెంప్లి, సంతానవృద్ధి
యలరినంతన యానంద మనుభవింపఁ
జాలఁ డెవ్వండు; దీన సంశయము లేదు.

(అశోక చక్రవర్తి సాధారణపు దుస్తులధరించి ప్రవేశించును. సంఘమునకు సాష్టాంగనమస్కార మొనర్చి, చేతులు జోడించి నిలువబడును).

ఉపగుప్తుఁడు—(వేదికపై నిలువఁబడి రెండుచేతు లెత్తి)

సార్వభౌమునకు సర్వమంగళములు చేకూరుగాక !

అందఱు—తథాస్తు. తథాస్తు. తథాస్తు. (అనియందురు.)

అశో—మహాత్మా! నా దొక్క-మనవి కలదు.

ఉప—సెలవిమ్ము.

అశో—ఆర్యా! ఈ దీనుఁడు సామ్రాజ్యమును సర్వసంపత్తులతో బౌద్ధసంఘమున కర్పించుచున్నాడు. అనుగ్రహించి యీ దుర్భరరాజ్యభారవహనము నా భుజస్కంధమునుండి తొలఁగింపుడు- (వంగి నమస్కరించును) ఎట్టి పరిశుద్ధాంతఃకరణముతో కార్యము లాచరించుచున్నను, పలువురు పలువిధములుగ భావించుచున్నారు. అందఱను రంజింపఁజేయుట దుస్సాధ్యముగ నున్నది.

కన్య—ఈ సామ్రాజ్యమును దత్తమొనర్చుటకు నీ కెంత మాత్రము నధికారము లేదు.

ఉప—బ్రాహ్మణోత్తమా! క్షమింపుము. అశోకుఁడు అజ్ఞానముచే నాడినపలుకుల కాగ్రహింపకుము.

రాజా! ఈ సామ్రాజ్యమునకు నీవు సంరక్షణకర్తవు. ఈ సంపత్తులు సాధనమాత్రములు. ఈ భూలోకమహానాటకమున నేఁడు నీవు సమ్రాట్టు పాత్ర ధరించియున్నావు. నీవుకాకున్న నీమహాసామ్రాజ్య మెవరు పాలింతురు?

అశో—(మెల్లగా) మీరు—

ఉప—సన్యాసులకు సామ్రాజ్యాధిపత్యమా! ముక్కుమూసికొని మూలఁగూర్చుండుట మాని, మమ్ము మణిమయఖచిత రత్నసింహాసన మారోహింపు మందువా! సర్వసంగ పరిత్యాగ మొనర్చిన మాకు మరల సామ్రాజ్యభారము మెడగట్ట నెంచుచుంటివా?

రాజా! వలదు, వలదు—మగవాని చేతియం దిడిన బిడ్డవలె,

ఆమదాని చేఁజిక్కిన దుడ్డువలె, సన్యాసుల చేతియందు సామ్రాజ్యము సన్నగిలిపోవును.

అశో—మహాత్మా! పాపపుణ్యభీతి నన్ను వేధించుచున్నది. స్వతంత్రించి నేనింక నీమహాసామ్రాజ్యమును పాలింపలేను.

ఉప—మంచిది. ఈ మగధసామ్రాజ్యమును మా కర్పించితివి.

అశో—చిత్తము.

ఉప—నేను నిన్నీ సామ్రాజ్యమునకు పాలకుఁడుగ నుండ నియమించుచున్నాను. ఏమందువు ?

నా యాజ్ఞ దిరస్కరింతువా ?

అశో—మహాప్రభో! మీ యాజ్ఞానువర్తినై వ్యవహరింతును; కాని అందలి పాపపుణ్యములతో నాకెట్టిప్రసక్తియును లేదు.

ఉప—ఆత్మసాక్షిగ నీ వన్నికార్యముల నాచరించుచుండుము. ఆ పాపపుణ్యముల భారము మేము వహింతుము. రాజా! నీవు నిశ్చింతతో వ్యవహరింపుము.

అశో—చిత్తము.

ఉప—మన మహేంద్రుని లంకాద్వీపమున కంపవలసియున్నది. కావున కారవాకి కొమరుఁడగు తీవరదేవుని యువరాజుగ నొనరింప నెంచితిని. అందు కేమందువు ?

అశో—చిత్తము. అటులే యొనర్పుఁడు.

ఉప—సేవకా! కారవాకిదేవి కొమరుఁడగు తీవరదేవు నిటకుఁ దీసికొనిరమ్ము.

అశో—మహాత్మా! అంతపసిబాలుఁడు రాజ్యవ్యవహారముల నెట్లు నిర్వర్తింపఁగలఁడు !

ఉప—మహామంత్రియగు రాధాగుప్తుఁడు యువరాజొనర్ప వలసిన కార్యములు సహితము నిర్వర్తించుచుండును.

(దాసి బాలుని తీసికొనివచ్చును. ఉపగుప్తుఁడు తీసెదిగివచ్చి బాలు నెత్తుకొని)

ఉప—సేవకా! సింహాసనము తీసికొనిరమ్ము.

(సేవకుఁడు బంగారుసింహాసనము తెచ్చి రంగస్థలముమధ్య నుంచును).

ఉప—(బాలు నందుంచి) సదస్యులారా! పౌరులారా!
ఈ ధీవరదేవుఁడు మగధసామ్రాజ్యమునకు యువరాజుగ నేటినుండియు నియమింపఁబడుచున్నాడు. ఈ బాలునకు యుక్తవయస్సు వచ్చుదనుక, మహామంత్రి రాధాగుప్తుఁ డితని ప్రతినిధిగనుండి యువరాజొనర్పవలసిన కార్యము లొనర్చుచుండును.

(అందరు నాబాలునిపై పుష్పములు జల్లుదురు)

దాసి— (ముందుకు వచ్చి) అమ్మగా రెందుకో ఇచ్చటికి విచ్చేయుద మనుచున్నారు.

అశో—(ఉపగుప్తునివంక చూచును)

ఉప—మంచిది. అవశ్యము రానిమ్ము.

(దాసి నిష్క్రమించును)

రాజా? ఏల సంశయించుచుంటివి.

కార—(తెల్లనినారచీరధరించి ప్రవేశించును. ఉపగుప్తునకును, సంఘమునకును, అశోకునకును నమస్కరించి) ఈదీనురాలి దొక కోర్కెకలదు. ఆర్యా! అనుగ్రహించిన విన్నవించెద.

(అందురు నొకరి నొకరు చూచుకొనుచుందురు).

అశో—(నిశ్చేష్టుఁడై నిలువబడియుండును)

ఉప:—అమ్మా, అవశ్య మటులేకానిమ్ము.

కార—మహాత్మా ! సార్వభౌముఁడు సామ్రాజ్యపాలనము సకవశ్యమని, నానాథుని నిర్బంధించి యిచ్చో నిలిపిరి. సంసారమును త్యజించుటకు నాకట్టి ప్రతిబంధక మేదియును లేదుకదా ?

ఉప—(నిర్వైరపడి చూచుచుండును).

కార—(అశోకుని వంకతిరిగి)

మానవజన్మ మెత్తినందుకు సంసారసుఖము లనుభవించి సంతానవతి నైతిని. ఇంక నిట్టి జన్మ మరి కలుగకుండు మార్గము చూచుకొనుటకు నాకు సెలవిండు నాథా!

(అని అశోకునియెదుట మోకాలపైఁ బడును).

అశో—(కన్నుల నీరుబెట్టుకొని భార్యరెండుచేతులు బట్టుకొని లేవనెత్తి అట్టె ఆమెను చూచును).

సాధ్వీ ! నీచరిత్ర నే నేమని కొనియాడఁగలను ! దేవు నలంకరించు పూజారికి ముక్తి దొరుకుట కల్ల. పైనుండి యేతెంచినవాఁ డావిగ్రహమును గాంచి భక్తిపరవశుఁడై తరించును. నేను ప్రకటించిన ధర్మములు నిన్ను తరింపఁ జేయుచున్నవి.

(నిట్టూర్పునిగిడ్చి)

దేవీ! నీకోర్కె దీర్చుటకు నే నశక్తుడను.

(కారవాకిచేయి ఉపగుప్తునిచేయియందుంచి)

దేవీ! యీమహాత్ముని సేవించి నీవైన నిర్వాణపదవి బడయుము.

(కారవాకి వంగి ఉపగుప్తునకు నమస్కరించి
అచ్చట నిలిచియుండును).

అశో—(కారవాకిని విడిచి ముందుకు వచ్చి)

గీ॥ అంధకారపుగృహమైన నాకురటంబు
కారవాకి దీప కళికవోలె
వెలుఁగఁ జేయు బాంధవ్యవింతగ నిందాక
కన్ను కలిగి చూఁగఁ గలిగి నాఁడు.

ఇంక నాముందుగతి ఎటులుండునో! (కనుల నీరుగార్చును).

ఉప—ఈదంపతుల వియోగము వీక్షించుట ఆజన్మబ్రహ్మ
చారినగు నాకే దుస్సహాముగనున్నది.

(కారవాకి నుద్దేశించి)

అమ్మా, నీకోర్కె నేనవశ్యము తీర్తును. కాని తల్లివైన
నీవు సంసారమును వదలి సన్యసించుటకు పూర్వము,
యువరాజ పట్టభద్రుఁడైన నీబాలుని దీవింపుము.

(సింహాసన మందున్న బాలునిదీసి కారవాకి కిచ్చును.)

కార—(బాలునెత్తుకొని ముద్దాడి)

నాథా, మీరువచ్చి సింహాసనముపై గూర్చుండుడు.

(అశోకుఁడట్లు చేయును).

బాలుని, అశోకుని ఒడియందుంచి కారవాకి
ప్రక్కనిలువబడి యుండును)

(దాసి మంగళహారతి గైకొని వచ్చును).

శార—(మంగళహారతి అందుకొని—అశోకునకును బాలున
కును బొట్టుపెట్టును).

దేవా, మీ ఆశీర్వచన మొక్కటియే మిగిలియున్నది.

(బ్రాహ్మణులును, భిక్షువులును, అందఱును నిలిచియుందురు).

ఉప:— గీ॥ స్వస్తియగుఁగాక ప్రజలకు; న్యాయమార్గ
మందు ప్రభువులు ప్రజలఁ గాపాడుఁగాక;
ప్రాణికోటులపైఁ బ్రేమ ప్రబలుగాక,
ధర్మమార్గంబు ధరణిపై వనరుఁగాక ॥

అందరు— తథాస్తు.

( మంగళము )

*******

సమాప్తము.